# ప్రజలకొరకు స్వాతంత్ర్యం

(FREEDOM FOR THE MASSES)

రచన

మన్‌మోహన్ చౌధరి

అనువాదం

తాడిగడప మార్కండేశ్వరరావు

ప్రచురణ

గాంధీజీ శతజయంతి సమితి

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక ఉపసమితి

# పీఠిక

గాంధీ శతజయంతిసమితి- ఆంధ్రప్రదేశ్ ఆర్థిక ఉప సమితి గాంధీశతజయంతి సందర్భంలో ఆంధ్రపాఠకలోకా నికి సమర్పిస్తున్న చిరుపొత్తమిది.

వందలాది సంవత్సరాల లోపభూయిష్టమైన సామా జిక వ్యవస్థ ప్రజలలో ఆత్మ విశ్వాసాన్ని పౌరవను పూర్తిగా లోపింపజేసింది మనదేశంలోనేగాక యావత్ ప్రపంచంలోను యిదేస్థితి కొనసాగుతున్నది. దాదాపు మూడుశతాబ్దాల విదేశీయ పరిపాలనమూలంగా మనదేశం ఇంకా దిగజారిపోయింది దీన్ని చక్కగా అవగాహన చేసుకున్న గాంధీమహాత్ముడు- కేవలం విదేశీపరిపాలన నుండి విముక్తిపొందటంతో తృప్తిపడలేదు. సామాజిక వ్యవస్థను ఆమూలాగ్రంగా మార్చవలెనని సంకల్పించారు. స్వాతంత్ర్య సంపాదనమేకాకుండా తదనంతర కార్యక్రమా నికికూడా దోహదం చేసేలాగున నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించారు కాని విధివశాత్తు వారి ప్రత్యక్ష నాయ కత్వంలో యీ కార్యక్రమాన్ని ఆచరించి, నూతన సమాజవ్యవస్థను రూపొందించుకొనేభాగ్యం-భారత దేశీ యులకు లేకపోయింది.

గాంధీమహాత్ముని తర్వాత అహింసాయుత సమా జాన్ని నెలకొల్పటానికి అనవరతము కృషిచేస్తున్న

"మహర్షి" వినోబా భావేగారు నిర్మాణకార్యక్రమా న్నంతా సంక్షిప్తంగా మూడు కార్యక్రమాలలో యిమిడ్చారు. దానినే త్రివిధకార్యక్రమము అని వారు పేర్కొన్నారు గ్రామదానము, గ్రామాభిముఖ ఖాదీ, శాంతిసేన- అనేవి వీని స్థూలస్వరూపాలు. గాంధీజీ శతజయంత్యుత్సవ సందర్భంలో యీ కార్యక్రమం పై నిర్మాణ కార్యకర్తలు తమ దృష్టిని కేంద్రీకరించవలసిందిగా వారు పిలుపునిచ్చారు. ఆ పిలుపునందుకొని దేశమంతటా కార్యకర్తలు యీ త్రివిధకార్యక్రమానికి చక్కటి రూపకల్పన చేశారు. వీటి వివరణమే యీ పుస్తక రూపంలో, సర్వోదయ నాయకుడైన శ్రీ మన్ మోహన్ చౌధరి ఇంగ్లీషులోనూ హిందీలోనూ వ్రాశారు దీనిని శ్రీ మార్కండేయశర్మగారు సులభశైలిలో తెలుగులో అనువదించారు

త్రివిధ కార్యక్రమాలనుగురించి ప్రతివారు తెలుసుకొనవలసిన యీ గాంధీ జయంతి సందర్భంలో యీ పుస్తకాన్ని ఆంధ్ర పారక లోకానికి సమర్పిస్తున్నాము

ప్రజలు, ముఖ్యంగా కార్యకర్తలు యీ కార్యక్రమాన్ని చక్కగా అవగాహన చేసుకొని ఆచరణలో పెట్టి, అన్నిరంగాలలోను యీ రంగంలోను ఆంధ్రదేశానికి పేరుప్రతిష్ఠలు చేకూరుస్తారని ఆశిస్తున్నాను.

జి. యస్. మేల్కొటె

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక ఉపసమితి అధ్యక్షుడు

గాంధీ శతజయంతి సమితి

# ఉపోద్ఘాతం

ఈ చిన్ని పొత్తాన్ని గాంధీ శతవార్షికజయంతి సమయంలో వెలువరించే పుస్తకాలలో ఒకటిగా ప్రజలకు అందిస్తున్నాం

వినోబాగారు ముఖ్యంగా భారతదేశంలోని గ్రామ సీమలలో సర్వోదయ కల్పనకు ఆచరణయోగ్యమైన ఒకరూపాన్ని అందివ్వడానికిగాను భూదాన, గ్రామదానో ద్యమ సౌధాలను నిర్మించారనే విషయం ప్రతి ఒక్కరికీ తెలుసు

ఈ పుస్తక రచయిత శ్రీ మన్‌మోహన్ చౌధరి గారు త్రివిధకార్యక్రమం (కార్యక్రమత్రయం) అనగా గ్రామదానం, గ్రామాభిముఖ ఖద్దరు, గ్రామీణ పరిశ్రమలు, శాంతిసేన—వీటియొక్క సర్వప్రముఖ నాయకులలో ఒకరు

భారతీయ సామాజిక పునర్నిర్మాణంలో ఆసక్తి కలిగిన ప్రతిఒకరికి ఈ కార్యక్రమత్రయంయొక్క మూల సిద్ధాంతాలను, గ్రామదానాన్ని వరించిన లక్షలాది గ్రామీణులతో వాటికున్న అవినాభావ సంబంధాన్ని తెలుసు కోవడం చాల అవసరం అలా తెలియచెప్పడానికి ఆ కార్యక్రమంలో అచంచల విశ్వాసంకలిగిఉండి సర్వసేవా సంఘ అధ్యక్షులుగా ఆ కార్యక్రమాన్ని దేశమంతటా

అమలుపరిపించడంలో నిమగ్నులై యున్న వీరికంటె సమర్థులైనవారు మరెవరుంటారు?

ఈ చిన్ని పుస్తకాన్ని చదివిన ప్రతిఒకరు కేవల సిద్ధాంత ప్రవచనాన్ని కాకుండా పల్లె ప్రాంతాలతో ప్రత్యక్షసంబంధం కలిగిఉన్న వేలాది గ్రామసేవకుల ఆదర్శ కృషిని ప్రతిబింబింపజేసే యీ పుస్తకంలోని విషయాలను చాల శ్రద్ధగా పరిశీలిస్తారని ఆశిస్తున్నాను.

సరళమైన, తేటతెల్లమైన శైలిలో వ్రాయబడిన యీ చిన్నిపొత్తం ప్రతి పారక మహాశయునికి గ్రామీణ సమస్యలను, వాటి పరిష్కారమార్గాలను పరిచయం చేయడమేకాకుండా వాటి సమ్యక్ జ్ఞానాన్నికూడ అందివ్వగలదనే నా ప్రగాఢ విశ్వాసం.

ఆర్. ఆర్. దివాకర్
చైర్మన్
గాంధీస్మారక నిధి

# మూర్తిత్రయం

(24 డిసెంబర్ 1963 నాడు రాయపూర్ సర్వోదయ సమ్మేళనంలోని ఉపన్యాసభాగం)

మూర్తిత్రయాన్ని సేవించడానికి మనం త్రివిధ కార్యక్రమాల్ని అమలుపరచదలచాం. మొదటిది సులభ గ్రామదానం. రెండవది గ్రామాభిముఖ ఖద్దరు పరిశ్రమ మూడవది శాంతిసేన వీటిలో ఒకటి ఉన్నచోట మిగిలిన రెంటినీ స్థాపించాలి రెండున్నచోట మూడవదానిని స్థాపించాలి. మూడూ లేనిచోట మూడింటినీకలిపి స్థాపించాలి.

ఈ కార్యక్రమం దాని త్రివిధ రూపాలలో ప్రజల ఆలోచనార్థం వారియెదుట ఉంచబడుతోంది. వానిలో ప్రతియొకటీ విశేషజ్ఞాన సమన్వితమైనదే అందువల్ల వాటిని విడివిడిగా పరిశీలించవలసి ఉంటుంది. కాని ఆచరణలోమాత్రం వాటిని వేరువేరుగా పరిగణించడానికి వీలు లేదు. అచట ఆ మూటిని ఏకంచేయాలి

పవిత్రమైన యీ త్రిమూర్తి స్వరూపం మూడు విభిన్న దేవతల కూడలికాదు. ఒకే ఒక అవిభాజ్యతత్త్వం (entity) అది.

నా జీవితాన్ని జీవనదానానికి అర్పించుకొన్నపుడు దాన్నొక పవిత్రమంత్రంతో పునీతంచేసుకొన్నాను. ఈ క్రింది పవిత్ర శబ్దాలతోకూడిన ప్రతిజ్ఞే ఆ మంత్రం.-

"నేను నా జీవితాన్ని భూదానంలో పాదుకొల్పి గ్రామీణ పరిశ్రమలచే వివేచించబడిన అహింసాయుత విప్లవానికి సమర్పించుకొంటున్నాను." (I dedicate my life to non-violent revolution rooted in Bhoodan and distinguished by village - industries) నేటి సులభ గ్రామదానం భూదానం యొక్క వికసితరూపమే గ్రామోన్ముఖ ఖద్దరు పరిశ్రమ గ్రామ పరిశ్రమల ఉత్కృష్ట చిహ్నం శాంతి సేన అహింసాయుత విప్లవ ఆగమనానికి సూచన.

ఈ కార్యక్రమంయొక్క విశేషగుణం ఏమంటే అది కేవలం భారతదేశానికేగాక సర్వప్రపంచానికీ మహా విపత్తునుండి ముక్తిని ప్రసాదించే కార్యక్రమం ఎందువల్ల నంటే అది ప్రజాశక్తిని ప్రజ్వలింపజేస్తుంది ప్రజాశక్తి మేల్కొనకపోతే, గ్రామాలు తమ పేద గ్రామీణుల బాధ్యతలు తామే వహించకపోతే, అవి ప్రతిస్వల్పవిషయానికీ నిస్సహాయస్థితిలో ప్రభుత్వంమీద నే ఆధారపడి ఉండే దుస్థితిలో ఉంటూఉండే శ్రేయోరాజ్యానికి మూలాధారాలైన స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, వాటిలో అంతర్నిహితమై ఉన్న సోషలిజంయొక్క ప్రధాన విలువలే మటుమాయమవుతాయి. ఆ పరిస్థితిలో భారతదేశం తన వినాశానికేకాకుండా మానవప్రపంచ వినాశానికే కారణ భూతురాలవుతుంది.

— వినోబా

# విషయసూచిక

# ప్రజలకొరకు సాంతంత్ర్యం

## మొదటి అధ్యాయం

## స్వరాజ్యము - ఆ తరువాత

"స్వతంత్ర భారతదేశంలో ఢిల్లీ భవంతులు, వాటిప్రక్కనే ఉన్న శోచనీయమైన గుడిసెల మధ్యగల భేదం ఒక్కరోజైనా మనజాలదు"

స్వాతంత్ర్య ప్రాప్తికి కొద్ది సంవత్సరాల పూర్వం గాంధీజీ చెప్పిన మాటలివి ఈ భేదం నేటికీ ఉండనే ఉన్నది ఉండడమే కాదు, ఎక్కువైనది కూడా.

స్వరాజ్యం సిద్ధించిన యిరువది సంవత్సరాల అనంతరం కూడా అధికాంశ ప్రజలు దారిద్ర్యంలో మునిగే ఉన్నారు ఆకలి, నిరుద్యోగం అలాగే వ్యాపించిఉన్నాయి. అజ్ఞానం, అనారోగ్యం లక్షలాది ప్రజలను యింకా పీడిస్తూనే ఉన్నాయి.

ప్రజలు స్వరాజ్యంరాగానే యివన్నీ మార్పు చెందుతాయనే ఆశతోనే స్వరాజ్యం కొరకు పోరాడారు.

ఆ ఆశ వ్యర్థమైనదికాదు జ్ఞానావధులు బాగా విస్తరించిన అసాధారణ యుగంలో మనం జీవిస్తున్నాం.

నలువైపులా ఆధునిక విజ్ఞానంయొక్క అద్భుత దృశ్యాలను మనం చూస్తున్నాం. విజ్ఞానం నేడు మనకొక గొప్పశక్తిని ప్రసాదించింది. ఆ శక్తిని సద్వినియోగపరిస్తే యీ భూమి మీద మనం స్వర్గాన్ని సృష్టించగలం. ఆకలిని, అనారోగ్యాన్ని, అజ్ఞానాన్ని శాశ్వతంగా నివారించగలం అంతే కాదు, ప్రపంచమందంతటా ప్రజలు సుఖమయమైన, తృప్తికరమైన జీవితం గడపగలుగుతారు అలా కాకుండా నేడు జరుగుతున్నట్లుగా దానిని యుద్ధాలకు, స్వలాభోపయోగానికీ (exploitation) దుర్వినియోగపరిస్తే అది యీ భూమిమీదగల సకల ప్రాణులను అంతంచేయగలదు అలా అంతంచేసే ఆ దారుణశక్తి అణుబాంబులలోను, ఉదజని బాంబులలోను కేంద్రీకృతమై ఉంది

హింసాయుతమైన విజ్ఞానం ప్రపంచ వినాశాన్ని, అహింసాయుతమైన విజ్ఞానం సుఖశాంతులను, స్వాతంత్ర్యాన్ని యివ్వగలదని గాంధీజీకి తెలుసు అందుకనే ఆయన భారత స్వాతంత్ర్య సమరంలో సత్యాగ్రహముచే సరిక్రొత్త ఆయుధాన్ని ప్రయోగించడమేకాక అహింసాయుత సమాజ స్థాపనకు పునాదిరాయిగా అష్టాదశసూత్ర నిర్మాణ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు దీనినే ఆయన సర్వోదయ మన్నారు

భారతదేశానికి అనేకమైన మౌలిక సమస్యలున్నాయి వాటిలో కొన్ని గత చరిత్రనుండి వచ్చినవి. కొన్ని విదేశీ ప్రాబల్యంవల్ల సృష్టించబడినవి మరికొన్ని

విజ్ఞానాన్ని స్వార్థపరత్వానికీ, స్వలాభోపయోగానికీ వినియో
గించడంవల్ల ఉత్పన్నమైనవి.

అసంఖ్యాకములైన ప్రవాహములు – చిన్నవీ, పెద్దవీ – వచ్చి చేరిన ఒక మహా సాగరంవలె భారతదేశం ఒక మహోన్నతమైన సంస్కృతీ పరంపర కాలవాలమైనది. ఆ విభిన్న సంస్కృతీ ప్రవంతుల మేలుకలయిక మహోన్నతములైన శక్తి సౌభాగ్యాలను సమకూర్చగలుగుచున్నది. కాని ఆ కలయిక యింకా పూర్తికానందువలన భాష, మతం, జాతి, రంగు మొదలైనవాటిమీద ఆధారపడిన సంకుచితత్వము, సంఘర్షణాల విషాదకర ఘట్టాలను మనం నేడు చూస్తున్నాము

వందలాది సంవత్సరాల లోపభూయిష్టమైన సామాజిక వ్యవస్థ ప్రజలలో పూర్తిగా ఆత్మవిశ్వాసాన్ని, గౌరవను శోషింప జేసింది విదేశీ పరిపాలన దానిని యినుమడింప జేసింది గాంధీజి దానిని బాగుచేయడానికి పూనుకొని చాలవరకు కృతకృత్యులయ్యారు కాని వ్యాధి యింకా పట్టుకొని వ్రేలాడుతూనే ఉంది అది ప్రజలను తమకు కావలసినవన్నీ ప్రభుత్వంగాని, మరి యితరులెవరైనాగానీ చేసిపెట్టాలని కోరుకొనేలా చేస్తున్నది

ఆధునిక పరిశ్రమలు, వాణిజ్యం మనదేశ సంపదను కొద్దిమంది చేతులలోనే కేంద్రీకృతమయేలా చేశాయి. ప్రయివేటు యాజమాన్యంలోని పారిశ్రామిక, వాణిజ్య

సంపత్తిలో 46 శాతం కేవలం 75 కుటుంబాల చేతులలోనే ఉన్నది.

భూ యాజమాన్యంలోకూడ అసమానత్వం ఉన్నది. కర్షకులలో సుమారు 20 శాతం కర్షకులకు భూమిమీద ఎట్టి హక్కూ లేదు. కాని సేద్యపుభూమిలో 70 శాతం మాత్రం కొద్ది కుటుంబాల యాజమాన్యంలోనే ఉన్నది.

ఆధునిక పరిశ్రమలు అనేకమైన చిన్న పరిశ్రమలను రూపుమాపి కోట్లాది ప్రజలకు నిరుద్యోగాన్ని ప్రసాదించాయి ప్రత్యామ్నాయ వృత్తి ఏదీ లేనందువల్ల ప్రజలు తప్పనిసరిగా సోమరితనం, లేములలో జీవితం గడుపుతున్నారు.

నేడు మనల నెదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో ఇవి కొన్నిమాత్రమే ముందు వీటిని పరిష్కరించనిదే మనలను బాధించుచున్న ఆహారకొరత, ధరల పెరుగుదల, నిరుద్యోగం, లంచగొండితనం మొదలైన యితర సమస్యలను పరిష్కరించడం అసాధ్యం. ఇంతవరకు జరిగిన మన ప్రభుత్వ ప్రయత్నాలన్నీ వీటిలో చెప్పుకోతగ్గ మార్పును తీసుకరాలేకపోయినాయి. గాంధీజీ అనుకొన్నట్లుగా, ఇప్పుడు వినోబాజీ అనుకొంటున్నట్లుగా బహుశః వాటిని అన్నింటినీ ప్రభుత్వమే పరిష్కరించడంకూడ సంభవం కాదేమో!

ప్రభుత్వంకంటె ప్రజాసామాన్యం ఒక మహత్తరమైన శక్తి ప్రభుత్వాలను కూలద్రోసి విప్లవాలద్వారా

గొప్ప మార్పులు తీసుకొనివచ్చేవారు, రాగలవారు సామాన్య ప్రజలు మాత్రమే

ఇప్పటివరకూ విప్లవాలు చాలవరకు హింసాయుతం గానే ఉంటూఉండేవి గాంధీజీ తమ సత్యాగ్రహోద్యమం ద్వారా అహింసాత్మక విప్లవాన్ని ఎలా సాధించవచ్చునో చూపించారు. ఆయన మన స్వాంతంత్ర్యసిద్ధికి చాల సహాయ పడ్డారు. అంతేకాదు. మనల నెదుర్కొంటున్న ప్రధానమైన సామాజిక, ఆర్థిక సమస్యలను శాంతియుత పద్ధతులద్వారా పరిష్కరించడానికి అనగా శాంతియుత సామాజిక విప్లవం తీసుకొనిరావడానికికూడా వారు ప్రయత్నించారు గాంధీజీ తరువాత వినోబాజీ ఆ ప్రయత్నంలో మార్గదర్శకులైనారు. స్వరాజ్యప్రాప్తి తరువాత మార్పుచెందిన పరిస్థితులలో వారు మొదట భూమి సమస్యను తీసుకొని దానిని పరిష్కరించేందుకుగాను భూదానోద్యమాన్ని ప్రారంభించారు. తరువాత దానినుండి గ్రామదానోద్యమం బయలుదేరింది

ఖద్దరు, శాంతిసేన యీ రెండూ గాంధీజీ ప్రారంభించిన రెండు ముఖ్యకార్యక్రమాలు. గ్రామదానం, ఖద్దరు, శాంతిసేన- ఈ మూడూకలసి యిపుడు కార్యక్రమ త్రయం లేక త్రివిధ కార్యక్రమంగా రూపొందాయి. గాంధీగారి యితర నిర్మాణాత్మక కార్యక్రమాలన్నీ యిందులోనే యిమిడిఉన్నాయి. ఎందుకంటే వినోబాజీ చెప్పినట్లు "తల్లిని పిలిస్తే ఆమెతోపాటు పిల్లలు తమంతట తామే వస్తారు." ఈ కార్యక్రమత్రయం దారిచూపి మిగిలిన

వాటికన్నిటికీ ఒక చక్కని వాతావరణాన్ని సృష్టిస్తుంది.

భారతీయ సామాజిక వ్యవస్థలో విప్లవతుల్యమైన ఒక శాంతియుత రూపాంతరంలేక మార్పుతీసుకొని రావడమే యీ కార్యక్రమంయొక్క ప్రధానలక్ష్యం. మనల నెదుర్కొంటున్న వివిధ సమస్యల పరిష్కారానికి కావలసిన ప్రజాశక్తిని సంఘటిత పరచి భవంతులు, గుడిసెలమధ్య గల భేదం ఒక్కరోజైనా మనజాలని సుదినాన్ని మనకు కేవలం ఈ కార్యక్రమం మాత్రమే ప్రసాదించగలదని మా విశ్వాసం.

# రెండవ అధ్యాయం

# గ్రామదానం

గ్రామదానోద్యమం భూదానోద్యమంనుండి బయలు వెడలింది. భూదానోద్యమం 1951 సంవత్సరం ఏప్రిల్ నెలలో ప్రారంభమైనది

1951 లో ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ లో విలీనమైన పూర్వపు హైదరాబాద్ రాజ్యానికి చెందిన తెలంగాణా జిల్లాలలో భూ సంబంధమైన గొప్ప అశాంతి చెలరేగింది. భారతదేశంలో చాల ప్రాంతాలలోవలె అచటకూడ బహు కొద్దిమంది చేతులలోనే అత్యధిక భూభాగం ఉండడం, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు బహుకొద్ది భూమి ఉండడమో, లేక అసలే భూమిలేకపోవడమో ఉంటూఉండేది. అందుచేత భూమిలేని బీదప్రజలు పెద్ద భూస్వాములనుండి భూమిని లాగుకొనేందుకు హింసాయుతమైన ఒక ఉద్యమాన్ని లేవదీశారు. పరిస్థితిని అదుపులో పెట్టేందుకుగాను సైన్యాన్ని పంపవలసివచ్చింది దానివల్ల చాల రక్తపాతం కూడా జరిగింది

అప్పుడు వినోబాజీ అచటి బీదప్రజలకు న్యాయాన్ని చేకూర్చి శాంతిని స్థాపించగల పరిష్కారం కనుగొనడానికై ఆ ప్రాంతానికి వెళ్లారు ప్రజలను కలుసుకొంటూ, పరిస్థి

తులను ఎప్పటికప్పుడు తాజాగా తెలుసుకొంటూ, వారు ఒక గ్రామంనుండి మరొక గ్రామానికి కాలినడకను నడిచి వెళ్లారు ఒక గ్రామంలో భూమిలేని కొన్ని కుటుంబాలతో సమావేశమైనపుడు ఆకుటుంబాలవారికి కొంత భూమిఉన్నట్లయితే వారు శాంతియుతంగా జీవించగలరని తేలింది. ఇంచుమించు వెంటనే శ్రీ రామచంద్రారెడ్డిగారు నూరు ఎకరాలభూమిని విరాళంగా ఇవ్వడం, భూదానోద్యమానికి బీజారోపణ జరగడం సంభవించింది

మనదేశంలో ప్రధానమైన, అత్యవసరమైన సమస్యలలో భూ సమస్య ఒకటి పూర్తిగా న్యాయరహితమైన భూ యాజమాన్య వ్యవస్థ 16 శాతం కర్షకులను పూర్తిగా భూమిలేని వాళ్ళనుగాను, అంతకంటె కొంచెం హెచ్చు సంఖ్యలోనున్న కర్షకులను బహుకొద్ది భూమిగలవారినిగాను తయారుచేసింది సాధారణంగా అల్పసంఖ్యాకులైన పెద్ద భూ ఖామందులు స్వయంగా వ్యవసాయం చేయరు. బీద ప్రజలు వారినుండి రొక్కపు పద్ధతిమీదగాని, పంటలో వాటాపద్ధతి మీదగాని భూమిని కౌలుకు తీసుకొంటారు దీనివల్ల స్వలాభోపయోగం, రైతులను భూమినుండి వెళ్ళగొట్టడం, హింసించి శిస్తువసూలుచేయడం మొదలైన అత్యాచారాలు బయలుదేరుతున్నాయి.

స్వాతంత్ర్యప్రాప్తికి చాలకాలం ముందే కాంగ్రెస్, తదితర అభ్యుదయ రాజకీయ పార్టీలు భూసంస్కరణల అవసరాన్ని గుర్తించాయి. స్వరాజ్యంవచ్చాక జమీం

దారులు, మాల్‌గుజారీలు మొదలైన మధ్యవర్తులయితే తొలగించబడ్డారు కాని న్యాయోచితమైన భూ పంపకానికి తగిన చర్యలింతవరకు తీసుకోనబడలేదు చాల రాష్ట్రాలలో గరిష్ఠ భూ పరిమితులు నిర్ణయించబడ్డాయి సహజంగానే అవి చాల ఎక్కువగా ఉన్నాయి అందువల్ల భూమిలేనివారికి బహుకొద్ది భూమిమాత్రమే మిగిలింది పరిమితి శాసనాలు కేవలం అగ్రస్థాయిలోనివారికి భూములను తిరిగి పంచి యిచ్చాయి. పెద్ద పెద్ద భూఖండాలు గరిష్ఠ పరిమితికి కొంచెం తక్కువగా చిన్నచిన్న భూఖండాలుగా విభజించబడ్డాయి

వెంటనే భూసంస్కరణలు చేయవలసిన అవసరాన్ని విదేశ నిపుణులుకూడ ధ్రువపరిచారు. భూ సంస్కరణలు మాత్రమే వ్యవసాయోత్పత్తిని పెంచడానికి తగు ప్రేరణ నివ్వగలవనియు, తగినంతగా ఆహారోత్పత్తి పెరగనిచో పంచవర్ష ప్రణాళికలు ఫలప్రదములు కాజాలవనియు వారు చెప్పారు అయినప్పటికీ కృషి చాల తక్కువగానే జరిగింది దాని దుష్ఫలితాలను దేశం నేడు అనుభవిస్తున్నది.

భూదానం స్వచ్ఛందకృషిద్వారా భూసమస్యను పరిష్కరింపబూనే ఒక ప్రయత్నం మాత్రమే వినోబాజీ దేశంలో పర్యటిస్తున్నకొద్దీ ఈ ఉద్యమం తెలంగాణానుండి భారతదేశం అంతటా వ్యాపించింది. కొద్ది సంవత్సరాలలోనే సుమారు 40 లక్షల ఎకరాలు భూదానానికి విరాళంగా లభించాయి. ఈ భూమిలో 10 లక్షల ఎకరాలు

ఇప్పటివరకు నాలుగు లక్షల భూ విహీన కుటుంబాలకు పంచిపెట్టబడ్డాయి విభిన్న రాష్ట్రాలలో గరిష భూపరిమితి శాసనాలద్వారా పునర్విభజనకు సంపాదింపబడిన భూ మొత్తాలకంటె ఈ మొత్తం చాల పెద్దదనే విషయం ఈ సందర్భంలో గమనించతగినది

భూదానోద్యమం దేశంలో ఒక క్రొత్త ఆశను, ఉత్సాహాన్ని రేకెత్తించింది అది ఇతర గ్రామీణ సమస్య లనుకూడా వెలుగులోనికి తీసుకొనివచ్చింది దేశంలోను, గ్రామాలలోను ఉన్న ప్రాచీనవ్యవస్థ సడలిపోతూ ఉన్నది. దానిలోనికి నవజీవనం తీసుకొనిరావడానికిగాను దానిని నవ్యాదర్శపు పునాదిమీద పునర్వ్యవస్థీకరించవలసి యున్నది భారతీయ నాగరికతకు, రాజకీయాలకు, ఆర్థిక వ్యవస్థకు గ్రామాలే పునాదిరాళ్లు అందుచేత భారత దేశపు మనుగడకు గ్రామ పునరుజ్జీవనం ఎంతో ఆవశ్యకం

గాంధీజీ మొదలైన ప్రసిద్ధ మేధావులందరు గ్రామ పునర్నిర్మాణావశ్యకతను గురించి దశాబ్దాలకు పూర్వమే నొక్కి చెప్పారు గ్రామదానోద్యమం గ్రామాలను పునరు జ్జీవింప చేయడానికి ఒక క్రొత్త మార్గాన్ని, వాటి చిరకాల సమస్యలను పరిష్కరించడానికి ఒక క్రొత్త సాధనాన్ని సమకూర్చి పెడుతున్నది

1953 సంవత్సరం మే నెలలో వినోబాజీ ఉత్తర ప్రదేశ్‌లోని హమీర్‌పుర్ జిల్లాలో మరొక గ్రామానికి పాదయాత్రసాగిస్తూ ఉండగా మంగ్రోత్ గ్రామవాస్తవ్యు

లందరు కలసికట్టుగావచ్చి ఆ గ్రామంలో తమకుగల భూమినంతటినీ భూదానోద్యమానికి విరాళంగా ఇచ్చి వేశారు. అ విధంగా గ్రామదానోద్యమం ప్రారంభమై భారతావనిలో మంగ్రోత్ ప్రధమ గ్రామదానమైంది.

అప్పటినుండి గ్రామదానోద్యమం బాగా వ్యాపించి 31 ఆగస్టు 1966 నాటికి పదమూడు సంవత్సరాల వ్యవధిలో దేశం మొత్తంమీద 26,421 గ్రామదానాలు జరిగాయి. ఉద్యమాన్ని ఎక్కువ ఉపయుక్తంగాను, అన్ని తరగతుల ప్రజలకు ఎక్కువ ఆమోదయోగ్యంగాను తయారుచేయ డానికిగాను దానిలో కొన్ని మార్పులు ప్రవేశపెట్టబడ్డాయి.

గ్రామదానం గ్రామవ్యవస్థలో సమూలంగా మార్పును తీసుకొనిరావడానికి ప్రయత్నిస్తుంది నేడు పేరుకు మాత్రమే గ్రామం ఉంటున్నది సాధారణంగా అది కొన్ని గుడిసెలకూడలి మాత్రమే సంకుచితమైన జాతి, వర్గకలహాలతో అద విదీర్ణమై పోయింది. ప్రతి కుటుంబం స్వార్ధచింతనలో మునిగి స్వప్రయోజనం కొరకే ప్రయత్ని స్తున్నది. ఇవన్నీ గ్రామ వినాశానికి కారణాలైనవి

మనమంతా ఐకమత్యంగాఉండి కలిసి పనిచేస్తే విజ్ఞానవరంవల్ల మనం మేలు పొందడమేగాక అన్నివిధాలా పురోగమించ గలుగుతాముకూడా. ఈనాడు సర్వప్రపం చమూ ఒక చిన్న నివాసస్థలమై పోయినది నేడు ప్రపంచ మంతా కొద్ది గంటలలో చుట్టి రాగలుగుతున్నాము అంతేకాదు కొద్ది క్షణాలలోనే ప్రపంచం ఈకొననుండి

ఆకొనకు సంబంధాలు ఏర్పరచుకో గలుగుతున్నాం. ప్రపంచం మనగలగాలంటే, అది పురోగమించాలంటే సర్వ ప్రపంచం ఒకటి కావలసిన ఆవశ్యకత అంతకంతకు ఎక్కువగా ప్రస్ఫుటమవుతున్నది. అట్టి పరిస్థితిలో గ్రామం మాటేమిటి? అది ఒకటిగానైనా ఉండాలి, లేదా విరోధశక్తులవల్ల అణగారైనా పోవాలి.

కష్టసుఖాల్లో భాగస్వాములు కావడంలోనే సరి అయిన ఏకమత్యం ఉంది. కుటుంబంలో ప్రతిఒకరు ఇతరులకోసమని కష్టాలనుకూడ సంతోషంగానే సహిస్తారు. పిల్లవాడు జబ్బుగా ఉన్నాడంటే కుటుంబంలోని ప్రతిఒకరు పట్టించుకొంటారు. అలాగే ప్రతి గ్రామాన్ని ఒక్కొక్క కుటుంబంగా తయారుచేయడమే గ్రామదానంయొక్క ముఖ్యోద్దేశం. భూమిలేని నిరుపేదలే గ్రామ కుటుంబంలో అందరికంటె దుర్బలజీవులు. వారి శ్రేయస్సుకొరకు గ్రామం అంతా పూనుకోవాలి.

అందువల్ల గ్రామదానంలో ప్రతి భూస్వామి తన భూమిలో కొంతభాగం గ్రామంలోని భూవిహీనులకు పంచి యివ్వాలి. ఇపుడున్న సులభ గ్రామదానపద్ధతి ప్రకారం గ్రామంలోని మొత్తం భూమిలో యిరవైయోవంతుభూమి ఆ విధంగా ఇస్తే చాలు. ప్రతి భూస్వామీ తనకున్న సేద్యపు భూ పరిమాణాన్నిబట్టి యిరవైయోవంతుకు కొంచెం హెచ్చుతగ్గుగా యివ్వవచ్చును. దీనిని గ్రామసభ నిర్ణయిస్తుంది.

భూమిమీదా, తదితర ఉత్పత్తి సాధనాలమీదా ప్రయివేటు యాజమాన్యం ఆధునిక ప్రపంచంలోని మహా నర్ధాలలో ఒకటి ప్రపంచాన్ని బాధిస్తున్న బ్రహ్మాండమైన ఆర్థిక అసమానత్వానికి మూలమే అది. అది మిక్కుటమైన స్వలాభోపయోగాన్ని, అధిక పీడనాన్ని పుట్టిస్తున్నది.

గాలి, నీరు, సూర్యుడు, ఆకాశంవలెనే భూమిని కూడ ఈశ్వరుడు ప్రతి ఒకరి ఉపయోగంకొరకు సృష్టించాడు. దానిని స్వంతంచేసుకొనడానికిగాని, తాను ఆశించినంతమేరకు తీసుకొనడానికిగాని, యితరులకు లేకుండా చేయడానికిగాని ఎవ్వరికీ హక్కు లేదు

ప్రయివేటు యాజమాన్యంవల్ల పొలం సేద్యగాని చేతుల్లోనుండి సేద్యంచేయనివారి చేతుల్లోకి, గ్రామస్థుల చేతుల్లోనుండి పట్టణవాసాలలోని పరోక్ష భూస్వాములు లేక కౌలుదార్ల చేతుల్లోకి వెళ్లింది. గ్రామంలో ఆర్థికాభివృద్ధి త్వరగా జరగాలంటే గ్రామ ప్రశాళిక అవసరం గ్రామంలోని భూమిఅంతా గ్రామస్థుల అధీనంలో ఉన్నప్పుడే దీర్ఘకాలిక ప్రణాళిక సంభవం అవుతుంది

అందుచేత గ్రామదానంలో ప్రతిభూస్వామీ భూమిమీద తనకుగల హక్కును గ్రామసంఘానికి అప్పజెప్పాలి. దానివల్ల గ్రామంలోని భూమి అంతా గ్రామసంఘానికి (village community) చెందుతుంది. కాని ఆచరణ సాధ్యమయ్యేటందుకు అది వ్యక్తిపరంగానే సేద్యం చేయబడుతుంది. భూమిలేనివారికి ఇరవైయోవంతు భూమినియిచ్చి

మిగిలిన భూమిని గ్రామసంఘం పూర్వపు యజమానికే యిచ్చివేస్తుంది దానిని అతడు స్వయంగా సేద్యం చేసుకొని గ్రామ నిధికిచ్చే వార్షిక విరాళంపోను మిగిలిన ఫలసాయాన్ని తానే అనుభవిస్తాడు అతని తరువాత అతని వారసులకు చెందేలాగున అతడు ఆ పొలంలో సేద్యం చేసుకొనే వంశ పారంపర్య హక్కు కలిగివుంటాడు అతని అనుమతి లేనిదే అతని అధీనంలో ఉన్న భూమినిగాని, దానిలో భాగాన్నిగాని గ్రామ సంఘం తీసుకోలేదు

ఏ గ్రామస్థునికీ తన పొలాన్ని గ్రామానికి బయట ఎవరికైనా అమ్మటానికిగాని, తనఖా పెట్టడానికిగాని, బదిలీ (ట్రాన్స్ఫరు) చేయడానికిగాని హక్కుండదు ఆ పనులు ఒక పరిమితమైన పద్ధతిలో గ్రామ సంఘపు పూర్వానుమతితో గ్రామంలోనే చేసుకోవలసి ఉంటుంది దీనివల్ల భూమి లేక పొలం గ్రామంలోనే ఉంటుంది అంతేకాదు దీని వల్ల ఏ గ్రామస్థుడుకూడా అజాగ్రత్తగా జీవితం గడపడానికిగాని, తనసంపదను తాగుడు మొదలగు వాటికొరకు దుర్వినియోగపరచడానికిగాని అవకాశం ఉండదు.

ప్రతి గ్రామం ఒక గ్రామసభను ఏర్పాటు చేసుకోవాలి ఆ సభలో వయస్సు వచ్చిన స్త్రీ పురుషులంతా సభ్యులై యుండాలి ఒక అధ్యక్షుని, ఒక కార్యదర్శిని. గ్రామం పెద్దదైతే ఒక కార్యనిర్వాహకసమితి (పాలకసమితి) ని వారు ఎన్నుకుంటారు ఆ గ్రామసభ గ్రామంయొక్క ఆర్థికాభివృద్ధికి తగు ప్రణాళికలు తయారుచేయడం, ప్రజలలో

నైతికవికాసాన్ని పెంపొందించడం, అసహాయులు, ఆర్తులు, భర్తృవిహీనలు, రోగగ్రస్తులు మొదలగువారి విషయమై శ్రద్ధవహించడం, మున్నగు గ్రామానికి సంబంధించిన పనులన్నిటినీ నిర్వహిస్తుంది వాస్తవ గ్రామరాజ్యం అంటే అదే. అందుకొరకై గ్రామసభ ఒక క్రమపద్ధతిలో తరచు సమావేశమవుతూ ఉండాలి

వివిధ రాష్ట్రాలలోని గ్రామదాన శాసనాలు, నూరు అంతకన్న ఎక్కువజనాభాగల గ్రామసభలకు గ్రామ పంచాయతీ హోదా నిస్తున్నాయి ఈ విధంగా గ్రామసభ పంచాయతీ రాజ్యానికి పునాదిరాయి అవుతున్నది.

గ్రామసభ గ్రామస్థులందరియొక్క సామూహిక సంకల్పానికి ప్రాతినిధ్యం వహిస్తుంది అప్పులిచ్చేవారు. వర్తకులు, ప్రభుత్వోద్యోగులు, పోలీసులు మొదలగు వారిని గ్రామస్థులు ఒక్కరొక్కరుగా కలుసుకోనవసరం లేకుండా గ్రామసభయే గ్రామస్థుల తరఫున బయటివారంపరితో వ్యవహరిస్తుంది. ఇంతవరకు వేలాది గ్రామాల్లో జరిగినట్లుగా అది గ్రామీణులను ఒత్తిడులనుండి, స్వలాభపరుల నుండి రక్షిస్తుంది.

గ్రామసభ నిర్ణయాలన్నీ ఏకీభావంద్వారా ఏకగ్రీవంగాగాని, అత్యధిక మెజారిటీద్వారాగాని తీసుకొన్నవై ఉండాలి భూనిర్వహణ, గ్రామనిధి వినియోగం, మొదలైన అతి ముఖ్యవిషయాలలో ఏకీభావం ఉండితీరాలి ఇందుకు సంబంధించిన నియమాలను గ్రామసభ రూపొందిస్తుంది.

మన గ్రామాలను పీడిస్తున్న నికృష్టాతి నికృష్టమైన శాపం ముఠాతత్వం. చాల గ్రామాలలో రెండుమూడు ముఠాలేర్పడడం, అవి పరస్పర విరోధాలవల్ల గ్రామంలో అందరి జీవితాలను దుర్భరంగా చేస్తూఉండడం మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. సాధారణంగా రాజకీయ పార్టీలు ఆ ముఠాలతో స్నేహం చేసుకొని అగ్నిలో ఆజ్యం పోసినట్లుగా వాటిని పెంపొందిస్తూ ఉంటాయి. కేవలం నామమాత్రపు మెజారిటీతో నిర్ణయాలు జరిగే ప్రజా స్వామిక వ్యవస్థ అనబడే పద్ధతివల్లకూడా యీ ముఠా తత్వాలు మరింత బలపడుతున్నాయి. ఏకాభిప్రాయంతో పనిచేయడం ఒక్కటే గ్రామంలో ఐకమత్యాన్ని పరిరక్షిస్తూ దానిని శక్తివంతంగా తయారుచేయగల ఏకైక మార్గం. ప్రయోగించబడినచోటల్లా ఇది చాల జయప్రదంగా నిరూపించబడింది. ఇది ఓర్పును, ఇతరుల అభిప్రాయాలను గౌరవించడాన్ని నేర్పుతుంది.

## గ్రా మ ని ధి

గ్రామదానపు గ్రామం "గ్రామనిధి" నొకదానిని ఏర్పాటు చేసుకోవాలి. దానికి ప్రతి కర్షకుడు లేక రైతు తన మొత్తం సాలుసరి రాబడిలో నలభైయోవంతు చందాగా యిస్తూఉండాలి. వ్యవసాయానికితోడు ఇతర ఆదాయ మార్గాలున్నవాళ్ళు వాళ్ళ సాలీనా రాబడిలో ముప్ఫైయోవంతు నగదురూపంలోగాని, శ్రమరూపంలో

గాని చందాగా యివ్వాలి. ఈ చందావంతును పెంచడానికి గాని, తగ్గించడానికిగాని గ్రామసభకు హక్కుంటుంది. ఈ గ్రామనిధి మేనేజిమెంటు గ్రామసభ చేతుల్లో ఉంటుంది. ఇది వ్యవసాయాభివృద్ధికి, గ్రామ పరిశ్రమలకు, తదితర వికాస కార్యక్రమాలకు ఉపయోగించబడుతుంది. గ్రామస్థులు తక్కువ వడ్డీపై దానినుండి అప్పు తీసుకోవచ్చు. వృద్ధులు, వికలాంగులు, భర్తృవిహీనలు, అనాధలు మొదలగు వారికికూడ యీనిధినుండే సహాయము చేయవచ్చును

ఏ ప్రభుత్వానికైనా తన పనులు నెరవేర్చుకోవడానికి ఖజానా అంటూ ఒకటి ఉండాలి గ్రామనిధి గ్రామరాజ్యపు ఖజానా కాని ఒక తేడా ఉంది. ప్రభుత్వపు ఖజానా బలవంతంగా వసూలుచేయబడిన పన్నులతో నిండితే గ్రామరాజ్యపు ఖజానా స్వేచ్ఛాపూర్వకంగాను, ప్రేమతోను ఇచ్చిన విరాళాలతో నిండుతుంది.

ప్రస్తుత సామాజికవ్యవస్థ ఆర్జన లేక సంపాదన తత్వంమీద ఆధారపడి ఉంది ఇందులో ఎవరిమట్టుకు వారు ఇతరులనుగూర్చి ఆలోచించకుండా తమమట్టుకు తాము వీలైనంత ఎక్కువగా ఆర్జించుకోవడానికి ప్రయత్నిస్తారు. దీనికి విరుద్ధంగా క్రొత్తవ్యవస్థ – దానిని సమాజవాదం అనండి, లేక సర్వోదయం అనండి – పరస్పర వినిమయంమీద అధారపడి ఉంటుంది అందువల్ల ఈవి (ఇవ్వడం) దాని ముఖ్య సిద్ధాంతాలలో ఒకటిగాఉంటుంది

ఈ ఈవి అవిచ్ఛిన్నంగా ఉండాలి. దానికి ప్రతి ఒకరూ ఒకసారి తనభూమిలో కొంతభాగం ఇవ్వడంతో సరిపోదు. ఎప్పుడూ ఏదో ఒక రూపంలో యిస్తూనే ఉండాలి. శ్రామికుడు తన శ్రమను, వర్తకుడు తన ధనాన్ని యివ్వాలి. ఉపాధ్యాయుడు లేక ఉద్యోగస్థుడు తన మానసిక శ్రమను, తెలివిని సమాజసేవకు వినియోగించాలి. ఈ విధంగా గ్రామనిధి ఒక నవజీవానికి, ఒక నూతన దృష్టికోణానికి ప్రతీకంగా ఉంటుంది.

ఒక గ్రామంలోని మొత్తం గ్రామస్థులలోనుండి 75 శాతము, రైతులలోనుండి కనీసం 75 శాతము పైన చెప్పిన నాలుగు షరతులనుచేర్చి ఖరారునామా వ్రాసి యిచ్చినప్పుడును గ్రామంతాలూకు కనీసం 51 శాతం భూమియొక్క యాజమాన్యం గ్రామసభకు సంక్రమించినప్పుడును ఆ గ్రామం గ్రామదానం క్రిందికి వస్తుంది

ఇంతేకాక ఒక గ్రామాన్ని గ్రామదానం క్రింద చట్టబద్ధంగా పరిగణించడానికిగాను కొన్ని శాసన సంబంధమైన మర్యాదలను లేక లాంఛనాలనుకూడ పాటించవలసి ఉంది. ఈ లాంఛనాలను పాటింపజేయడానికిగాను ప్రతి రాష్ట్రంలోను రాష్ట్ర ప్రభుత్వం తరఫున తగిన భూదాన లేక గ్రామదాన బోర్డులు ఏర్పరచబడ్డాయి.

## మూడవ అధ్యాయం

# గ్రామదానము, ప్రభుత్వము, ప్రణాళికా రచన

స్వరాజ్యం సిద్ధించిన తరువాత ప్రణాళికాబద్ధమైన దేశాభివృద్ధికిగాను వేలాదికోట్ల రూపాయలు వెచ్చించబడ్డాయి బ్రహ్మాండమైన ఫ్యాక్టరీలు, ఆనకట్టలు నిర్మించబడ్డాయి. వేలాదిమైళ్ళ క్రొత్తరోడ్లు, రైలుమార్గాలు వేయబడ్డాయి అసంఖ్యాకమైన పాఠశాలలు, ఆస్పత్రులు స్థాపించబడ్డాయి. అనేకములైన చెరువులు, నూతులు త్రవ్వబడ్డాయి గత నూరుసంవత్సరాలలోకన్న యీ యిరవై సంవత్సరాలలో ఎంతో కృషి జరిగింది కాని మౌలిక సమస్యలు మాత్రం అలానే ఉన్నాయి

అలా ఉండడానికి కారణం ప్రణాళికారచన కేవలం బాహ్యస్థాయిలో జరగడమే ముఖ్యంగా పట్టణాలను దృష్టిలో పెట్టుకొనే ప్రణాళిక లేర్పరచబడ్డాయి భారతీయులలో 85 శాతం గ్రామాలలో నివశిస్తున్నప్పటికి ప్రణాళికలలో వారికి తక్కువస్థానమే లభించింది వినోబాజీ చెప్పినట్లుగా అవి 'వడపోత' సిద్ధాంతం (percolation theory) మీాద నడిచాయి మనం భూమిమీాద నీరుపోసినపుడు పైపొర పూర్తిగా నిండిన తరువాత చిన్నచిన్న రంధ్రాలద్వారా కొంతనీరు క్రింది పొరకుకూడ దిగుతుంది. అదే విధంగా మన ప్రణాళికలలోకూడా ధనవాహిని పైస్థాయిలోనే ప్రవ

హించింది క్రిందిస్థాయివారికికూడ కొద్దో, గొప్పో జార గలదనే ఉద్దేశ్యంతో. ఈ పద్ధతివల్ల లక్షాధికార్లు కోటీశ్వరులయ్యారు కాని భిక్షాధికారులు మాత్రం అలానే ఉండి పోయారు.

ఆచరణానుభవంలేని పైతరగతి మనుష్యులు ప్రణాళికలను తయారుచేశారు అందువల్ల అవి ఎవరికొరకై ఉద్దేశించబడ్డాయో వారికి వాటినిగూర్చి చర్చించడానికి గాని, తమ అభిప్రాయాలు వ్యక్తపరచడానికిగాని, వాటిని అమలు పరచడంలో భాగస్వాములు కావడానికిగాని అవకాశమే లేకుండా పోయింది. అంతా అధికారుల హస్త గతమయింది

ఒకరకమైన ప్రజాస్వామికవ్యవస్థ మనదేశంలో యిప్పుడున్నది. నడిచినంతవరకు అది బాగానే నడుస్తుంది. కాని అది చాలదూరం నడవలేదు. ఐదేళ్ళకొకసారి ప్రజలు వోటు చేస్తారు అంతే తిరిగి ఎన్నికలరోజు వచ్చేవరకు వారికి ప్రణాళికలతోగాని, పరిపాలనతోగాని ఎట్టి సంబంధం ఉండదు ఆశాసౌధాల్లో విహరిస్తూనో, లేదా కోపతాపాలు వెల్లడి చేస్తూనో కూర్చొనడం - ఇదే వారు చేయ దగినదల్లా.

అందువల్ల గ్రామోద్ధరణకు కోట్లాది రూపాయలు వ్యయమైనా అవి అన్నీ బూడిదలోపోసిన పన్నీరులా హరించిపోయాయి 'నేను నాకొరకే' అనే పాతసిద్ధాంతమే నడుస్తూఉంది ప్రతి ఒక్కరికీ తమమట్టుకు తాము ప్రభుత్వ

వ్యయంలోనుండి వీలయినంత ఎక్కువ సేకరించుకోవాలనే తాపత్రయమే.

దీనిని సరిచేయడంకోసమే పంచాయతీరాజ్యం ప్రవేశపెట్టబడింది కాని ఆశించిన లక్ష్యాన్ని సాధించడంలో అది యింతవరకు కృతార్థం కాలేదు. ఎందువల్లనంటే అందులో వినోబాజీ చెప్పినట్లుగా బండిముందు గుఱ్ఱాన్ని ఉంచడానికిబదులుగా గుఱ్ఱంముందు బండి ఉంచబడింది ఢిల్లీ, లక్నో, భువనేశ్వర్ మొదలైన పట్టణాలలో కేంద్రీకృతమైఉన్న అధికారం తాలూకు కొన్ని చిన్న ఖండాలు గ్రామాలకు పంచిపెట్టబడ్డాయి కొద్దోగొప్పో చదువుకొని గ్రామసంపదను తమగుప్పిట్లో పెట్టుకున్న కొద్దిమంది చేతుల్లోనికి ఆ అధికార ఖండాలు వెళ్లాయి ఇప్పటి వరకూ వారు ఈ అవకాశాన్ని దురదృష్టవంతులైన తమ సోదర ప్రజానీకంనుండి స్వప్రయోజనాన్ని సిద్ధింపచేసుకోవడానికి వినియోగించుకొన్నారు. ఇప్పుడు వారి దమననీతిని పూర్తిచేయడానికిగాను రాజకీయాధికారాలుకూడా వాటికి జోడించబడ్డాయి.

స్వలాభోపయోగపుపట్టు సడలించాలంటే అన్నిటికంటేముందు గ్రామ వాతావరణంలోను, దృక్పథంలోను మార్పురావాలి అప్పుడే పంచాయతీరాజ్యం ప్రజలకుమేలు చేయగలుగుతుంది.

స్వరాజ్యం లక్షలాది ప్రజల త్యాగఫలితంగా సిద్ధించింది అందువల్లనే దానికొక పవిత్రత, శక్తి లభించాయి.

అలాగే పంచాయతీరాజ్యాన్ని యధార్థం చేయడానికికూడా కొంతత్యాగం అవసరం గ్రామదానం ఆ త్యాగానికి, దృక్పథంలో మార్పుకు కావలసిన పునాదిని ఏర్పరుస్తుంది.

భూస్వాములు స్వచ్ఛందంగాను, స్నేహభావంతోను తమ భూములలో భూమిలేని వారినికూడ భాగస్వాములుగా చేసుకొనడం గ్రామంలో ఒక క్రొత్త ఆరోగ్యకరమైన, ఆహ్లాదకరమైన, సుహృద్భావపూరితమైన వాతావరణాన్ని సృష్టిస్తుంది. ప్రైవేటు యాజమాన్యానికి స్వస్తిచెప్పడమంటే వ్యక్తులు అంతులేని సంపదను సముపార్జించడానికి స్వస్తిచెప్పడమన్నమాట

చాలా రాష్ట్రాలలో సుమారు మూడు నాలుగువేల జనాభాకలిగిన ఒక పెద్ద యూనిట్‌ను గ్రామ పంచాయతీ అంటారు ఆ యూనిట్‌లో 10 నుండి 20 గ్రామాలవరకు కూడ ఉండవచ్చు అది సరిఅయిన గ్రామపంచాయతీ కాజాలదు ఎందుకంటే అందులో 20 గ్రామాల ప్రజలూ కూర్చొని తమ సమస్యలనెన్నడూ చర్చించుకోలేరు ప్రతి గ్రామంనుండి ఒకరిద్దరు ప్రతినిధులు మాత్రం పంచాయతీగా ఏర్పడి రాష్ట్రప్రభుత్వంనుండి లభించే లాభాలు మాత్రం పంచుకోవడంలో తలపట్లు పట్టుకొంటూ కూర్చుంటారు. దీనివల్ల గ్రామాలలోని మిగతా ప్రజలకు పంచాయతీ సమస్యలతో పరిచయంగాని, సంబంధంగాని ఏర్పరచుకొనడానికే అవకాశం ఉండడంలేదు పంచాయతీలుకూడా పాట్నా, లక్నో మొదలైన నగరాలలోఉన్న విధానసభల

మోస్తరుగానే గ్రామప్రజలకూ, వారిసమస్యలకూ చాల దూరమైపోతున్నాయి.

సరైన గ్రామపంచాయతీ ఒకేఒక గ్రామానికి సంబంధించినదై ఉంటుంది. దానిలో ఆ గ్రామ ప్రజలంతా కలిసి కూర్చొని తమ సమస్యలను తామే పరిష్కరించు కొంటారు. అప్పుడే స్వరాజ్యం వారిజీవితాలతో పెనగొని ప్రజారాజ్యమనిపించు కొంటుంది ఈవిధంగా ప్రజలకు ప్రత్యక్షసంబంధం ఉన్నప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం యేర్పడుతుంది

ఈ విధంగా గ్రామదానపు గ్రామంలోని గ్రామ సభ పంచాయతీరాజ్యానికి, స్వరాజ్యానికి, సురాజ్యానికి అసలైన పునాదిని వేస్తుంది.

గ్రామదానంఅంటే అర్థం గ్రామస్థాయినుండి సరియైన ప్రణాళికను ప్రారంభించడమన్నమాట. ప్రజలకు కావలసిన పాలు, పండ్లు మొదలగువాటినికూడ చేర్చి ఆహారక్షేత్రంలో గ్రామాన్ని స్వయంసమృద్ధంగా ఉంచే లాగున గ్రామసభ అధికాహారోత్పత్తికి వలయు ప్రణాళికలను తయారుచేయవలసి ఉంటుంది. స్థానికంగా దొరికే ముడివస్తువుల నుపయోగించి ప్రజలకు పనికల్పించుటకై అది చిన్న పరిశ్రమలను ఏర్పాటుచేయవలసి ఉంటుంది. వ్యాపారం అంతా సహకార పద్ధతిమీద జరుగుతుంది. గ్రామంలోని పిల్లలందరినీ ఉత్పాదనాపరులు, ఉపయోగ కారులు అయిన పౌరులుగా తయారుచేసే విద్యను నేర్పి

తారు. ఆరోగ్యరక్షణ, పారిశుద్ధ్యము, వివాహాలు, ఉత్స వాలు, వేడుకలు, తగవులు మొదలైన గ్రామానికి సంబం ధించినవాటినన్నిటినీ గ్రామసభ రూపొందించి చూచు కొంటుంది మద్యం, మత్తుమందులు మొదలైనవ టికి సంబంధించిన కట్టుదిట్టమైన నిషేధంకూడ గ్రామసభ ముఖ్య విధులలో ఒకటి

నేడు గ్రామాలకు తగినంత స్వేచ్ఛ, దొరవలేవు. అగ్రశ్రేణిలోనే అధికారమంతా కేంద్రీకృతమై ఉంది అగ్రశ్రేణివారి జోక్యం వీలయినంత తక్కువ ఉండేలాగున గ్రామప్రజలకు వీలయినంత ఎక్కువస్వేచ్ఛతో తమ వ్యవ హారాలను తామే చక్కబెట్టుకొనేందుకు వీలుకల్పించే లాగున గ్రామ స్వరాజ్యానికి గ్రామదానం పునాదిరాయి వేస్తుంది భూమికి సంబంధించిన ప్రభుత్వపు రికార్డంతా అనేకమైన వ్యక్తులపేర్లమీద కాకుండా గ్రామంపేరు మీదనే ఉంటుంది. ఫలానా గ్రామానికి మొత్తం ఇన్నిఎక రాల పొలం ఉంది అన్న ఒక్కపద్దు (entry) మాత్రమే ప్రభుత్వ రికార్డులో ఉంటుంది అలాగే గ్రామంపేరుమీద ఒకేఒక పట్టాఉంటుంది.

దీనివల్ల రెవిన్యూడిపార్టుమెంటు, రిజిస్ట్రారు ఆఫీసులు, సివిలుకోర్టులు మొదలైనవాటితో పనేఉండదు. భూముల తాలూకు రికార్డంతా గ్రామసభ వద్దనే ఉంటుంది. ఆక్రమ ణలు, మార్పులు ఏమైనా ఉంటే అవన్నీ అచటనే నమోదుచేయబడతాయి.

పోలీసులు, లాకోర్టుల సహాయము పేక్షించకుండా తగవులు, దెబ్బలాటలుఅన్నీ గ్రామంలోనే శాంతియుతంగా, స్నేహపూరితంగా పరిష్కరించుకోవడానికి తగు ప్రయత్నాలు జరుగుతాయి కోర్టువ్యాజ్యాలు గ్రామసంపదనుదహరించే మహామారులు గ్రామదానంక్రిందకువచ్చిన వేలాది గ్రామాలలో వ్యాజాలు పూర్తిగా మటుమాయమైనాయి ప్రతిగ్రామంలోను నేరాలను అరికట్టి శాంతిని నెలకొల్పేందుకు ఎంతోమంది శాంతిసైనికులు, శాంతి సేవకులు ఉంటారు.

గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించడంవల్ల గ్రామాలు పెద్దవ్యాపారస్థుల పిడికిలినుండి బయటపడతాయి దీనినిగురించి విపులంగా ఖాదీనిగూర్చిన అధ్యాయంలో చర్చించబడుతుంది.

ప్రజలు ప్రభుత్వసహాయాన్ని ఆశించే అలవాటుకులోనైనారు. ప్రభుత్వంవద్దనుండి ఏదివచ్చినా దానిని పూర్తిగా ఉచితమైన బహుమతిగా వారు భావిస్తూ ఉంటారు కాని వాస్తవస్థితి అదికాదు. ప్రభుత్వం అది ఖర్చుపెట్టే ప్రతిపైసను ఎక్కువగా పరోక్షపన్నులు అనగా బట్ట, పంచదార, అగ్గిపెట్టెలు మొదలగువాటిపై విధించే ఎక్సైజ్ సుంకాలద్వారా రాబట్టుకొంటుంది దానిలో పెద్దమొత్తాన్ని అది డబ్బు సంపాదించి ఖర్చుపెట్టే పరిపాలనా యంత్రాంగంమీద ఖర్చుచేస్తుంది. ప్రభుత్వం పన్నులరూపంలో వసూలుచేసే ప్రతి రూపాయిలోనుండి

40 పైసలు పరిపాలనా యంత్రాంగంమీద ఖర్చవుతున్నది. ఆ ఖర్చుపెట్టేవారి ద్వారా ఎంతసొమ్ము స్వాహా అవుతుందో అది ఎవరూ చెప్పలేరు. మిగిలిన సొమ్ములోనుండి కంట్రాక్టర్ల లాభాలూ అవీ మినహాయిస్తే ఎక్కువకెక్కువ 30 పైసల విలువగల వినియోగాన్నిమాత్రం ప్రజలు పొందగల్గుతున్నారు

అలా కాకుండా గ్రామసంఘమే ఆ సొమ్మును రాబట్టి ఖర్చుపెడితే రూపాయిలో కనీసం 90 పైసలు సద్వినియోగ పడతాయి. ఈ రకంగా గ్రామస్వరాజ్యం ఒక్కటిమాత్రమే ప్రభుత్వరంగంలో జరుగుతున్న విపరీతమైన దుర్వ్యయాన్ని అరికట్టగలుగుతుంది

## బ్లాక్ దానం

బ్లాక్ దానం గ్రామస్వరాజ్యాన్ని మరొక అడుగు ముందుకు తీసుకొని వెడుతుంది. నీటిపారుదల, మధ్య తరహా పరిశ్రమలు, మాధ్యమికవిద్య మొదలైన కార్యాలెన్నో అభివృద్ధిచెందవలసి ఉన్నాయి వాటి అభివృద్ధికి ఒక గ్రామంకంటె ఎంతో పెద్దదైన ఒక యూనిట్ కావాలి అటువంటి పరిపాలనా సంబంధమైన ఒక యూనిటీ బ్లాక్. ఒకబ్లాక్‌లోని గ్రామాలు అన్నీ లేక యించుమించు అన్ని గ్రామాలు గ్రామదానంక్రిందకువచ్చినపుడు బ్లాక్ సాయిలోని పంచాయతీసంస్థ అయిన పంచాయతీసమితే గ్రామస్వరాజ్య సిద్ధాంతాల ప్రకారం పనిచేస్తుంది

అప్పుడు ప్రజలే తమ అవసరాలకు అనుగుణంగా ప్రణాళికలను రూపొందించుకొంటారు గ్రామదాన గ్రామాలలోని ఐకమత్యాన్ని, ఉత్సాహాన్ని సమీకరించి ఆ ప్రణాళికలను అమలుపరచుకొంటారు.

ఈ పుస్తకం వ్రాసేనాటికి సుమారు 40 బ్లాక్ దానాలు జరిగాయి. కొద్దిరోజులలోనే మరికొన్ని వందలు జరుగవచ్చు. 'జిల్లా దానాలు' అప్పుడే చాలమంది ఆలోచనలో ఉన్నాయి. బీహారులోని సర్వోదయ కార్యకర్తలు మొత్తం రాష్ట్రాన్నే గ్రామదానంగా పొందాలని ప్రతిజ్ఞ తీసుకొన్నారు

గ్రామదానంక్రింద కొన్నిలక్షల గ్రామాలు వచ్చినప్పుడు దేశపరిపాలనమీద, దేశప్రణాళికలమీద దాని ప్రభావం ఎలా ఉంటుందో బాగా ఊహించవచ్చును. రెండింటి స్వభావాన్నే అది పూర్తిగా మార్చివేస్తుంది. అప్పుడు దళిత ప్రజానీకపు శ్రేయస్సే సర్వప్రధానంగా ఉంటుంది. గ్రామదానోద్యమంయొక్క చరమలక్ష్యం కూడా అదే.

## నాలుగవ అధ్యాయము

# రక్షణచర్యగా గ్రామదానం

అది 1962 వ సంవత్సరం అక్టోబర్ నెల చైనా సేనలు లడఖ్ - నీఫా రంగాలలో ముందుకు చొచ్చుకొని వస్తున్నాయి దేశమంతా తల్లడిల్లి పోతూవుంది అప్పుడు వినోబాజీ పశ్చిమ బెంగాల్‌లో పాదయాత్ర సాగిస్తున్నారు. యుద్ధాన్ని గూర్చి విన్న వెంటనే ఆయన భారతవాసులు ఆత్మరక్షణకై తయారుకావడానికి సర్వోత్తమమైన మార్గం గ్రామదానం ఒక్కటే అని యెలుగెత్తి చాటారు

చాలమందికి ఆ భావం క్రొత్తగాను, వింతగాను తోచింది కాని వినోబాజీకి అలా కాదు 1957 వ సంవత్సరంలో ఎల్వాల్ సమావేశంలో వారు విదేశీ దురాక్రమణ నుండి అత్మరక్షణ చేసుకొనేలాగున దేశాన్ని పటిష్ఠం చేసేందుకుగాను వెంటనే గ్రామదానోద్యమాన్ని దేశమంతటా విస్తరింపజేసి అమలుపరచవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని నొక్కి వక్కాణించారు

వారిలా అన్నారు - "ప్రపంచంలో శాంతి నెలకొని ఉండగలదనే ఆశమీదనే నేటి మన ప్రణాళికలు రచింపబడ్డాయి. ప్రపంచశాంతికి భంగంకలిగినా, లేక భారతదేశం ఏదైనా సంఘర్షణలో చిక్కుకొనవలసివచ్చినా ఏమవుతుంది? అప్పుడు మన విదేశవ్యాపారం దెబ్బతిం

-టుంది. దానివలన దేశంలోని వర్తకవ్యాపారాలుకూడ పాడవుతాయి. మన ప్రణాళికలన్నీ కేవలం నిరుపయోగకరమైన శుష్క రచనలుగా ఉండిపోతాయి. నేటి పంచవర్ష ప్రణాళికలన్నీ వ్యర్థమవుతాయి ”

1965 నాటి పాకిస్థాన్ ఘర్షణ కొద్దికాలం మాత్రమే జరిగింది కాని మన ఆర్థికవ్యవస్థమీద దాని దుష్ప్రభావం ఎంతగానో పడింది అంతకన్న పెద్ద సంఘర్షణలు, లేక ప్రపంచయుద్ధమేవస్తే ఇంకా ఎటువంటి దుష్పరిణామాలు సంభవిస్తాయో, వాటి తొలిరుచిని దాంటో మనం చవి చూచాం.

వ్యాపారం దెబ్బతింటే ప్రజలకు జీవితావసర వస్తువు లందివ్వడం కష్టమవుతుంది దానివలన ప్రజలలో బాధ, అసంతృప్తి చెలరేగి వారినైతికస్థాయి దిగజారిపోతుంది గ్రామాలు, బ్లాకులు గనుక గ్రామదానపద్ధతిలో వ్యవస్థీకృతమైతే తిండి, బట్ట మొదలైన జీవితావసర వస్తువు లన్నింటిలోను అవి స్వయంసమృద్ధిని సాధించి రహదారులు వ్యాపారం దెబ్బతిన్న పరిస్థితులలోకూడా చెక్కుచెదర కుండా నిలుస్తాయి.

రెండవది దేశంలో శాంతిభద్రతలు నెలకొల్పడానికి నేడు చాల పోలీసుబలగం అవసరంగా ఉంది. తరచు వారికి సాయంచేయడానికి సైనిక సిబ్బందినికూడ పంపవలసివస్తూ ఉంది. కాని గ్రామదాన గ్రామాలలో శాంతి భద్రతల రక్షణకు పోలీసులు లేక సైనిక సిబ్బంది సహాయం అక్కర

లేకుండా గ్రామ ప్రజలే ఏర్పాటు చేసుకొంటారు దాని వలన పోలీసులను, సైన్యాన్ని మరొకచోట యింకా ఎక్కువ అవసరమైన కార్యాలలో నియోగించవచ్చు.

సమగ్రమైన దేశరక్షణ జరగాలంటే దేశమంతా, ప్రతిగ్రామం కాకపోయినా, కనీసం ప్రతిప్రాంతమైనా ఆహారక్షేత్రంలో స్వయంపోషకంగా ఉండాలి. అందుకే వినోబాజీ ప్రతిగ్రామమూ కనీసం రెండుసంవత్సరాలకు సరిపడే ఆహార ధాన్యాలు నిలువచేసుకోవాలని పదేపదే చెప్పుతూ ఉంటారు దానివలన గ్రామాలకేకాకుండా దేశంమొత్తానికీ ఆర్థికస్తోమత లభిస్తుంది ఇవన్నీ గ్రామ దానంవల్లనే చేకూరతాయి

నేడు భారతదేశాన్ని చైనా బెదరిస్తోంది. ఆ బెదరింపు కేవలం దేశ సరిహద్దులలోనే లేదు. దాని ఆయువు పట్టు గ్రామాలలో ఉంది భారతదేశం మొత్తాన్నిగాని, దానిలో అధికాంశాన్నిగాని చైనా కేవలం సైనికబలంతోనే ఎన్నడూ ఆక్రమించ జాలదు చైనా నాయకులు ఆ విధంగా ఆలోచించడంలేదుకూడ. వారు దేశంలో సామ్యవాద విప్లవం రావాలని కోరుకుంటున్నారు. ఎందుకంటే సామ్యవాద ప్రభుత్వం చైనా చెప్పుచేతలలో ఉంటుందని వారి ఊహ

అస్త్రాలు సరిహద్దులలో సైనిక గమనాన్నైతే నిలువరించ గలుగుతాయి కాని భావగమనాన్ని ఎన్నడూ నిలువరించలేవు. దేశంలో దారిద్ర్యం, ఆకలి, స్వలాభాపే

యోగం, అన్యాయం తాండవించినంతకాలం ప్రజలకు హింసాయుత విప్లవంవైపు ఆకర్షణ ఉంటుంది. ఆ పరిస్థితు లలో వినోబాజీ చెప్పినట్లు ప్రతి గ్రామంలోను చైనా అమెరికాలు ఉదయిస్తాయి.

అమెరికా చైనాలమధ్యగల బద్ధవైరం విభిన్నదృక్ప థాలతో అవి కోరుకొనే ప్రపంచ స్వరూపంమీద ఆధారపడి ఉన్నది చైనా నాయకులు వ్యక్తి స్వాతంత్ర్యం, ప్రజా స్వామ్యం మంటగలిసినాసరే సాంఘిక, ఆర్థిక సమానత్వం కావాలంటారు అమెరికా నాయకులు ఆర్థిక అసమా నత్వం, స్వార్థపరత్వం వెల్లివిరుస్తున్నాసరే వ్యక్తి స్వాతం త్ర్యం, ప్రజాస్వామ్యం కావాలంటారు పరస్పర విభిన్న భావాలుగల వీరుభయులుకూడా భారతదేశంలో పలుకు బడిని సంపాదించాలని ప్రయత్నిస్తున్నారు. చైనాలడఖ్ ప్రాంతంలో కొన్నివేల కిలోమీటర్ల భారత భూభాగాన్ని ఆక్రమించినట్లుగానే అమెరికా మన ఆర్థికవ్యవస్థలో ప్రముఖమైన ప్రాబల్యాన్ని సంపాదంచడానికి ప్రయత్ని స్తోంది.

ఆర్థిక సమానత్వం, వ్యక్తిస్వాతంత్ర్యం, ప్రజా స్వామ్యం - ఇవన్నీకూడా మానవజాతి భవిష్యత్ శ్రేయ స్సుకు అత్యంతావశ్యకమైనవే చైనీయులు, అమెరికా వారు భావిస్తున్నట్లుగా అవి పరస్పర విరుద్ధమైనవి కానే కావు. అహింసాయుత సాధనాల నుపయోగిస్తే ఒకేసారి వాటినన్నింటిని సాధించవచ్చును. గ్రామదానంవల్ల

గ్రామాలలోని స్వప్రయోజనకర సంఘర్షణలను పరస్పర సుహృద్భావం, అనుభవజ్ఞానంద్వారా పరిష్కరించుకో వచ్చును దీనివల్ల చైనా అమెరికా సిద్ధాంతాలపట్ల గ్రామస్థులకున్న పక్షపాతవైఖరి ఒక్కదెబ్బతో ఎగిరి పోతుంది

ఈ విధంగా గ్రామదానం నిజానికి దేశరక్షణ చర్యలో అత్యంత ముఖ్యమైనదని వినోబాజీ ఒకసారి చెప్పి నట్లుగా గ్రామదానం ఒకటిమాత్రమే దేశాన్ని రక్షిస్తుం దని మేము చెప్పడంలేదు దేశరక్షణకు దీనితోపాటు చాలా ఇతర చర్యలుకూడా అవసరమే. కాని గ్రామదానం లేకుండా ఆ యితర చర్యలన్నీ దేశానికి తగురక్షణ నివ్వ జాలవనిమాత్రం ఘంటాపథంగా చెప్పగలం

# ఐదవ అధ్యాయం

## కొన్ని సమస్యలు

మన గ్రామాలలో మూడురకాల ప్రజలు నివసిస్తున్నారు ఒకరు భూమికలిగిన రైతులు, రెండవవారు భూమిలేని బీదరైతులు, కార్మికులు, మూడవవారు వర్తకులు, వడ్డీవ్యాపారస్థులు. భూస్వాములవద్ద భూమిఉన్నది. దానిని పండించడానికి కర్షకులవద్ద కృషి లేక పనిపాటలున్నాయి. వర్తకులు, వడ్డీవ్యాపారస్థులవద్ద పంట పెట్టుబడికి కావలసిన సొమ్ము కార్యనిర్వాహణశక్తి ఉన్నాయి ఇవన్నీ గ్రామ సౌభాగ్యానికి అవసరమే అందుకనే గ్రామదానం వాటి నన్నిటినీ ఒకచోట చేర్చడానికి ప్రయత్నిస్తుంది.

కొంతమంది పెద్ద భూస్వాములు గ్రామదానంలో చేరడానికి భయపడుతున్నారు. పిల్లలచదువులు, వారి పెండ్లిండ్లు మొదలైన ఎన్నో బాధ్యతలుండడంవలన తమ భూమిలో ఎక్కువభాగం దానంగా ఇవ్వలేమని వారను కొంటున్నారు వారి భయాన్ని నివారించడానికే గ్రామదానం సులభతరంగా మార్పుచేయబడింది వారు వారి భూమిలో ఇరవైయోవంతుమాత్రం ఇస్తేచాలు గ్రామదానం సాధించదలచిన గొప్పలక్ష్యంతో పోల్చిచూస్తే యీ త్యాగం చాలా స్వల్పమైనదే.

మరొకభయం కార్మికులకు సంబంధించినది. కార్మికులనుండి పని ఏమైనా జరగాలంటే వారు భూమిలేనివారుగాను, దరిద్రులుగాను, అజ్ఞానులుగాను, భూస్వాములచేతిక్రింద పనిచేసేవారుగాను ఉండాలని చాలమంది అనుకొంటూ ఉంటారు. కొన్ని శతాబ్దాలనుండి యీ అభిప్రాయం నడుస్తూ వస్తూవున్నది. పూర్వం ఒకానొకప్పుడు బానిసత్వం వాడుకలో ఉండేది పశుతుల్యులుగా ఉంటేనే కార్మికులు పనిచేస్తారని ఆనాడు అనుకుంటూ ఉండేవారు. అందుచేత బానిసత్వం అమలులోకి వచ్చింది కాని నేడు అట్టి మూర్ఖాభిప్రాయాలకు స్వస్తి చెప్పబడింది ఆర్థికాభివృద్ధిగాంచిన ఏ సభ్య దేశానికైనా నేడు మనం వెళ్ళితే అచ్చట కార్మికులుకూడ ధనవంతులతోను, విద్యాధికులతోను సమానంగా ఆదరించబడడం చూస్తాం. చదువుకొన్న కార్మికులుమాత్రమే ఆధునిక పద్ధతులలో యంత్రాలనుపయోగించి ఉత్పత్తిని బాగా పెంచగలుగుతున్నారు.

కార్మికులతో ఉదారంగా వ్యవహరించి వారిని సుఖులుగాను, సంతృప్తులుగాను ఉంచినట్లైతే వారు శ్రేష్ఠమైన వస్తువులను అధికంగా పండించగలరనే సత్యాన్ని ఆ దేశాలలోని పెట్టుబడిదారులుకూడ గుర్తించారు అందుచేత బూజుపట్టిన పాతభావాలను ఇపుడు మనం పూర్తిగా వదలి వేయాలి

కార్మికులనుగూడ ఒకేకుటుంబంలోని వారినిగా భావించి వారి శ్రేయస్సుకుకూడ పాటుబడాలి. గ్రామం

లోని యితరులందరివలెనే వారికికూడ సరియైనవిద్య లభించి వారుకూడ సుఖకరమైన, సంతృప్తికరమైన జీవితం గడప గలగాలి. అప్పుడే గ్రామస్థులంతా ఆధునిక వైజ్ఞానిక పద్ధతుల ప్రయోజనాన్ని పొంది యిప్పటికన్న ఎక్కువగా ఉత్పత్తిని సాధించగలుగుతారు పురాతన భావాలను అంటిపెట్టుకొనడంవల్ల భూస్వాములు సాధారణ అభివృద్ధిని అరికట్టడమేగాక ఎన్నో మంచి వస్తువులను వారు పోగొట్టు కొంటారుకూడ.

అప్పిచ్చేవారు, వర్తకులుకూడ గ్రామదానం అంటే సాధారణంగా భయపడుతూ ఉంటారు వడ్డీవ్యాపారస్థులు తాము అప్పిచ్చినసొమ్ము తమకు దక్కుతుందో లేదోనని భయపడుతూ ఉంటారు గ్రామదానంలో ప్రయివేటు యాజమాన్యానికిగాని, భూమిని మరొకరి కివ్వడానికిగాని అవకాశమే లేనందున అప్పిచ్చినసొమ్ము ఎల్లా రాబట్టుకో గలుగుతామని వారి చింత. కాని వాస్తవానికి గ్రామదానం వారిసొమ్ముకు ఎక్కువ భద్రతను కల్పిస్తుంది అప్పు లివ్వడం, వసూలుచేయడం గ్రామసభద్వారానే జరుగు తుంది అందువల్ల సొమ్ము వసూలు బాధ్యత గ్రామసభ మీదనే ఉండి ఋణస్థులతో వ్యక్తిగతంగా వ్యవహరించే పరిస్థితికన్న చాల మెరుగైన పరిస్థితి ఏర్పడుతుంది

వినోబాజీ అప్పివ్వడం జీవనోపాధికి ఒకసాధనం కాకూడదని పదేపదే చెప్తూఉంటారు వడ్డీవ్యాపారికూడ వ్యవసాయం, చిల్లరదుకాణం, వర్తకం మొదలైన సరియైన

పద్ధతులద్వారా జీవనోపాధిని సాధిస్తూ ఉండాలి. ఏమీలేని వాళ్లు ఏదో ఒక వృత్తిని చేపట్టాలి. అప్పివ్వడం వడ్డీ లేకుండా జరగాలి. తరుగు, ఖాతాపుస్తకాల వ్రాత మొదలగువాని క్రింద కొద్ది మొత్తాన్ని తీసుకోవచ్చు.

వర్తకునికి తన లాభాలు పోతాయని భయం, కాని ఎక్కువ ఉత్పత్తి, ఎక్కువ అమ్మకంవల్ల అతడు అత్యధిక లాభార్జనకు లోనుగాకుండా మంచిలాభాన్నే సంపాదించుకోవచ్చు అందువల్ల అప్పిచ్చేవారు, వ్యాపారస్థులుకూడ గ్రామదానంలో తప్పకుండా చేరి తమ తెలివితేటలను గ్రామసభ, గ్రామనిధి, సహకారసంస్థలు, గ్రామఅంగడి (village stores), మొదలగువాటి అభివృద్ధికి ఉపయోగించవలసి ఉంటుంది.

పరోక్ష భూస్వాములుకూడా గ్రామదానంలో చేరాలి. గ్రామదాన శాసనాలు అలా చేరడాన్ని అంగీకరిస్తాయి.

పెండ్లిండ్లు, శ్రాద్ధాలు మొదలైనవాటి ఖర్చును గురించిన సమస్య ఉన్నది తన భూమిని అమ్మడంగాని, తనఖాపెట్టడంగాని చేయలేనిస్థితిలో పెండ్లిండ్లు మొదలగు వాటికి సాధారణంగా అయ్యే పెద్ద ఖర్చులకు సొమ్ము ఎలా లభిస్తుంది? కాని యీవిధంగా పొలం అమ్మి సొమ్ము సంపాదించడం ఆత్మహత్యా సదృశమనే విషయం మనం గుర్తించాలి వినోబాజీ ఒకసారి ఒక చక్కని ఉదాహరణ నిచ్చారు ఒకసారి ఒకమనుష్యుడు చీకటిపడే సమయానికి

కొండచివరను ఉండిపోయాడు. బాగా చలిగాఉంది అతని దగ్గర ఒక దుప్పటిమాత్రమే ఉంది. చలినుండి వెచ్చదనాన్ని యివ్వడానికి అది సరిపోలేదు అందుకని అతని కొక ఉపాయంతోచింది దుప్పటినతడు నిప్పులో పడవేశాడు అది బాగా మండి అతనికి బాగా వెచ్చదనం లభించింది. కాని ఎంతసేపు కొద్ది నిమిషాలుమాత్రమే ఆ తరువాత అతడు ఎక్కువ చలికి గురిఅయి మరణించాడు.

పెళ్లిళ్లు వగైరాలకు పొలం అమ్మడంగూడా అటువంటిదే దానివల్ల అతని వారసులకుకూడా జీవనోపాధి లేకుండాపోతుంది. అందువల్ల అటువంటి ఖర్చులకుగాను వేరే ఉపాయాలు ఆలోచించాలి ఆ ఖర్చులనుకూడ బాగా (drastic) తగ్గించాలి. భారతదేశంవంటి బీదదేశంలో అటువంటి విపరీత ఖర్చులు చాల అనుచితమైనవే. గ్రామదానంలోని గ్రామ సమూహాలు కలిసి కూర్చొని ఆ ఖర్చులు తగ్గించేందుకు ఉపాయాలాలోచించాలి. సామూహిక వివాహాలు ఏర్పాటుచేస్తే తక్కువఖర్చుతో ఎక్కువ ఆనందాన్ని పొందవచ్చు.

గ్రామదానంవలన గ్రామంలో సామూహిక వ్యవసాయం జరిగి గ్రామస్థులు కేవలం ఫ్యాక్టరీలలోని కూలీల స్థాయికి దిగజారిపోతారనే భయంతోకూడా కొంతమంది గ్రామదానోద్యమాన్ని విమర్శిస్తున్నారు. ఈ భయం పూర్తిగా నిరాధారమైనది. గ్రామదానంలో సాగుకాని భూమి వ్యక్తులకే యివ్వబడుతున్నది. బలవంతమైన సామూ

హిక వ్యవసాయానికి అందులో చోటులేదు ఏకాభిప్రాయం ఆధారంగా గ్రామసభ తీసుకొనే నిర్ణయాలకు లోబడి వ్యక్తి స్వాతంత్ర్యానికి అధికాధిక ప్రాధాన్యం యివ్వబడుతుంది

వ్యక్తిగత వ్యవసాయంకన్న సామూహిక వ్యవసాయం ఎక్కువ లాభకరమని తోచినపక్షంలో కొంతమంది వ్యవసాయదారులు కలిసి సంఘాలుగా ఏర్పడి వారి భూములను ఉమ్మడిగా సాగుచేసుకోవచ్చును.

ఇక ప్రధానసమస్య ఆర్థిక సమానత్వానికి సంబంధించినది ఇరవై యోవంతు భూమిమాత్రమే బీదలకు ఇవ్వబడే పరిస్థితులలో ఆర్థిక సమానత్వం ఎలాసాధ్యపడుతుంది? ఎందుకంటే పంచియివ్వడం అయినతర్వాతకూడా పూర్వపు తేడాలు అంతస్పష్టంగాను ఉండనే ఉంటాయి అందుకనే మేము చెప్పేదేమంటే ఆర్థిక సమానత్వం అనేది ఒక్క దెబ్బతో వచ్చేదికాదు, అది నెమ్మదిగా ఒక క్రమప్రకారం రావాలి, ఆ క్రమ ప్రకారమైన మార్పు తీసుకొని రాగలిగిన సాధనమే గ్రామదానం అని, వినోబాజీ దీనిని పర్వతారోహణతో పోల్చారు. పెద్దపెద్ద బండలను, నిట్టమైన ఏటవాలు ప్రదేశాలనుకూడా అవలీలగా అధిగమిస్తూ పర్వత శిఖరాన్ని చేరగలిగే సాహసికులైన ఆరోహకుల సంఖ్య అత్యల్పంగా ఉంటుంది. మిగిలినవారు అంత సాహసానికి పాల్పడలేరు. అట్టివారికొరకు అనగా వృద్ధులు,

స్త్రీలు, బాలురుకూడ ఎక్కువ శ్రమలేకుండా నెమ్మదిగా శిఖరాన్ని చేరుకొనేటందుకు వీలుగ ఇంజనీర్లు కొండలపై రోడ్లు నిర్మిస్తున్నారు. ఈ రోడ్ల వెంబడి నడిచి వెళ్ళినట్లయితే గమ్యాన్ని చేరడానికి కొంచెం ఎక్కువసమయం పట్టవచ్చును. కాని మార్గం అందరూ వెళ్ళడానికి అనువుగా ఉంటుంది గ్రామదానంకూడా పర్వతశిఖరం చేరడానికి వేయబడేరోడ్డువంటిదే ఆ బాటవెంబడి నడుస్తూఉంటే కొంతకాలానికి సులువుగా గమ్యస్థానం తప్పక చేరుకోగలం.

మొదట్లో భూమిలో కొద్దిభాగాన్ని పంచియివ్వడం జరుగుతుంది. దానివలన భాగస్వాములుగాఉండే సంప్రదాయం ఏర్పడుతుంది. అపుడు ఉత్పత్తిని పెంచేందుకు కృషిజరుగుతుంది. అంతకుపూర్వం భూవిహీనులుగా ఉన్నవారికి కొద్దిభూమితోపాటు ఇతర పరిశ్రమలనుకూడా కొన్నింటినేర్పాటు చేస్తారు దానివల్ల వాళ్ళరాబడి బాగా పెరుగుతుంది. ఇతర వ్యవసాయదారులుకూడా తమ భూములలో పంటను మరింత అధికంగా పండిస్తారు దానివలన వారి రాబడి బాగా పెరిగి కొన్ని సంవత్సరాలలో తమంత తామే మరికొంత భూమిని బీదలకు పంచియిచ్చేస్థితికి వారు వస్తారు ఆ విధంగా ఈ క్రమం కొనసాగుతూ ఉంటుంది.

భావితరాలవారు న్యాయాన్నిగురించి ఆర్థిక సమానతనుగురించి యిప్పటితరంవారికన్న తక్కువకాని శ్రద్ధను

వహిస్తారని వినోబాజీ మనకు జ్ఞాపకంచేస్తూ ఉంటారు. మన కార్యాన్ని వాళ్ళు ఇంకా ఎక్కువ పట్టుదలతో ముందుకు తీసుకొనివెళ్తారు కాలం ఎప్పుడూ పురోగమిస్తుందికాని తిరోగమించదు చరిత్ర ఎప్పుడూ మార్పువైపు శీఘ్రగమనంతో పురోగమిస్తూ ఉండడంవలన మన లక్ష్యంకూడా అనుకొన్నదానికంటే త్వరగానే సిద్ధిస్తుంది.

## ఆరవ అధ్యాయం

# ఆచరణలో గ్రామదానం

మంగ్రోత్ గ్రామంలో అంకురించిన గ్రామదానోద్యమం క్రమేణా యితర ప్రాంతాలకుకూడా వ్యాపించింది. 1955 వ సంవత్సరంలో ఒరిస్సాలో సుమారు ఒకవెయి గ్రామదానాలు జరిగాయి. 1958 నాటికి ఆంధ్రప్రదేశ్, మదరాసు, కేరళ, మహారాష్ట్ర ప్రాంతాలలో వందలకొద్ది గ్రామదానాలు జరిగాయి కాశ్మీర్, నాగాలాండ్ మినహా భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలోను ఇప్పటికి కొన్ని గ్రామదానాలు జరిగాయి

1957 వ సంవత్సరంలో మైసూరు ప్రాంతంలోని ఎల్వాల్‌లో బ్రహ్మాండమైనసభ జరిగింది. దానికి నాటి రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాదుగారు, భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూగారు, వినోబాజీ, భారతదేశంలోని ముఖ్య రాజకీయ పార్టీలైన కాంగ్రెస్, ప్రజాసోషలిస్టు, కమ్యూనిష్టు పార్టీల అధినేతలు విచ్చేశారు. రెండురోజుల చర్చల తరువాత ఆ సభలో గ్రామదానోద్యమానికి మూడు ప్రముఖ రాజకీయపక్షాల ఏకగ్రీవామోదంతో ఒక ప్రకటన అంగీకరించబడింది. ఆ ప్రకటనలో గ్రామదానమే భూ సమస్యకు సర్వోత్తమమైన పరిష్కారమనియు, దాని వలన భారతదేశపు భౌతిక, నైతిక ఉన్నతి ఇనుమడిస్తుం

దనియు తెలుపబడింది. గ్రామదానోద్యమానికి, సమాజ వికాసోద్యమానికి మధ్య చాల సన్నిహిత సహకారం ఉండాలనికూడా ఆ ప్రకటన కోరింది.

1961 వ సంవత్సరంలో వినోబాజీ అస్సాం వెళ్లారు. అచట వారి 18 నెలల పర్యటన కాలంలో 900 పైగా గ్రామదానాలు జరిగాయి. వారు అస్సాంనుండి తిరిగి రాగానే భారతదేశంపై చైనా దురాక్రమణ జరిగింది. ఆ సందర్భంలో వినోబాజీ రక్షణోపాయంగా గ్రామదానం ఆవశ్యకతను నొక్కి-వక్కాణిస్తూ అందరికీ ఆమోద యోగ్యంగా ఉండేలాగున దానిలో కొన్ని మార్పులు చేశారు.

దానిననుసరించి పశ్చిమబెంగాలులోను, ఇతర ప్రదేశాలలోను వందలకొలది గ్రామదానాలు జరిగాయి. ఇంతకుపూర్వం జరిగినవాటిలో మంగ్రోత్ అయితే మామూలు గ్రామం. ఒరిస్సా, మహారాష్ట్ర ప్రదేశాల లోని గ్రామదానాలు చాలవరకు ఆదిమవాసుల ప్రాంతా లలోనివి మద్రాస్‌లోని గ్రామదానాలన్ని సుమారైన ఆదివాసేతర గ్రామాలు అలాగే అస్సాంలోకూడా. కాని ఇకనుండి పెద్దవి, సౌభాగ్యవంతమైనవి, విద్యాధిక స్థాయిగలిగినవి అయిన గ్రామాలు గ్రామదానంగా లభించడం ప్రారంభించాయి. గ్రామదానం భారతదేశంలో ఏ ప్రాంతంలోనైనా, ఏ గ్రామంలోనైనా ఒక ఆచరణ సాధ్యమైన కార్యక్రమంగా రూపొందింది.

1964 సంవత్సరం డిసెంబర్ నెలలో రాయపూర్‌లో జరిగిన అఖిల భారత సర్వోదయ సమ్మేళనంలో గ్రామదానం, ఖద్దరు, శాంతి సేన అను త్రివిధ కార్యక్రమం అంగీకరించబడింది 1969 లో జరిగే గాంధీజీ శతజయంత్యుత్సవాల సందర్భంలో ఆ మహామహుని సంస్మరణార్థం దేశం సమర్పించే భక్త్యంజలి రూపంగా దేశంలోని ప్రతి గ్రామంలోను ఆ కార్యక్రమ త్రయం ద్వారా గ్రామస్వరాజ్యానికి సరియైన పునాది ఏర్పడాలని ప్రకటించబడింది

1965 జూన్ నెలలో బీహారులోని గ్రామదానోద్యమంలో తీవ్రతుఫాను గమనం తీసుకొనిరావడానికి వినోబాజీ కొన్ని సూచనలిచ్చారు బీహారులోని తమ సహచరులు ఆరు నెలలలో పదివేల గ్రామదానాలు సంపాదించడానికి ప్రయత్నిస్తామని మాటయిస్తే తాముకూడ బీహారు వచ్చి వారికి సాయపడతామని చెప్పారు. దానికి వారి సహచరు లంగీకరించారు. వినోబాజీ 1965 సెప్టెంబరు 11 వ తేదీన బీహారు చేరారు తరువాత సమయం కొంచెం పొడిగించవలసి వచ్చింది. 1966 జులై నెలాఖరుకు మొత్తం 9,200 గ్రామదానాలు జరిగాయి.

ఈ తీవ్ర గమనం భారతదేశమంతటా వ్యాపించి గ్రామదానాల సంఖ్య ఒక సంవత్సరం క్రితం ఉన్న 7,000 నుండి 1966 జులై నాటికి ఒక్కసారిగా 23,000 వరకు పెరిగింది

1966 ఏప్రిల్ నెలలో బలియాలో జరిగిన అఖిల భారత సర్వోదయ సమ్మేళనంలో 1966 వ సంవత్సరాంతానికి 50,000 గ్రామదానాలు జరగాలని ఒక తీర్మానం ఆమోదించబడింది. ఆ సందర్భంలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారు 1969 లో జరిగే మహాత్మాగాంధీ శత జయంత్యుత్సవాల నాటికి భారతదేశంలో ఉన్న మొత్తం ఐదున్నర లక్షల గ్రామాలుకూడ గ్రామదానాలుగా వచ్చేస్తాయనే ఆశను వ్యక్తపరచారు

ఈ గ్రామదానాలు జరిగిన తరువాత వాటిలో ఇంతవరకు ఏమిపని నడిచిందనే ప్రశ్న తరచు వినవస్తూవుంది

జరిగిన అతి ముఖ్యవిషయాలు ఆ గ్రామాలలోని భూమిమీద ప్రయివేటు యాజమాన్యం తొలగడం, భూమి లేనివారికి భూమిదొరకడం

జయప్రకాశ్ నారాయణ్‌గారు చెప్పినట్లు భూమిమీద ప్రయివేటు యాజమాన్యం తొలగడం అనేది పరప్రభుత్వంనుండి స్వాతంత్ర్యాన్ని సంపాదించడంతో పోల్చతగిన ఒక విప్లవాత్మకచర్య, మిగిలినవేమీ లేకుండా కేవలం అది ఒకటిమాత్రమే సిద్ధించినప్పటికీ గ్రామదానం సార్థకమైనట్లే.

వేలాది గ్రామదానాలకు బదులు కొన్ని ఆదర్శ గ్రామాల నెందుకు సృష్టించకూడదు? అనే ప్రశ్నకుకూడ ఇందులోనే సమాధానం ఉన్నది గ్రామదానోద్యమం యొక్క ముఖ్యోద్దేశం ప్రయివేటు యాజమాన్యంపట్ల

సామాజిక దృక్పథంలో మార్పు తీసుకొని రావడమే. దానిని వీలైనంత ఎక్కువ విస్తృతంగా తీసుకొని రావాలి గాని ఏవో కొన్ని ఆదర్శ గ్రామాలలో ప్రదర్శిస్తే చాలదు.

ఈ గ్రామదాన గ్రామాలలో వేలాది కుటుంబాలకు స్నేహసౌహార్ద్రాలతో భూమి ఇవ్వబడిందంటే అది సామాన్య విషయంకాదు అది ఆ గ్రామాలలోని వాతావరణాన్నే మార్చివేసింది వాటిలో క్రొత్త సామాజిక దృక్పథం, నవైక్యత సిద్ధించాయి. వాటి తత్క్షణ ప్రభావం కోర్టు వ్యాజ్యాలమీద పడింది. గ్రామదాన గ్రామాలలో వ్యాజ్యాలు పూర్తిగా అదృశ్యమైనాయి బ్లాక్ దాన క్షేత్రాలలోని పోలీసుస్టేషన్లలో నమోదైన ఫిర్యాదులను చూచినట్లైతే వాటిసంఖ్య గతంకన్న యిప్పుడెంతగానో తగ్గినట్లు తెలుస్తుంది

ఈ ఐక్యత చాలప్రాంతాలలో, ముఖ్యంగా ఒరిస్సా గుజరాతులలోని గ్రామాలలో అవినీతిని ఎదురించడంలో చాలా ఉపకరించింది. చిన్నచిన్న ప్రభుత్వోద్యోగుల బలవంతపు మామూళ్ళు ప్రతిఘటించబడడమే కాకుండా కొన్ని కేసులలో అవినీతిపరులైన ఉద్యోగస్థులు వారుచట్ట విరుద్ధంగా తీసుకొన్న సొమ్మును వాపసు చేయవలసి వచ్చిందికూడ

ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలోని ఆర్థికవ్యవస్థ వడ్డీవ్యాపారస్థులపిడికిలిలో ఉంటుంది. సాధారణంగా వారు అప్పిచ్చిన సొమ్ముమీద సంవత్సరానికి 50 నుండి 150 శాతం వడ్డీగుంజుతూ ఉంటారు. మొదట్లో ఈ వడ్డీ వ్యాపా

రులు గ్రామదాన గ్రామాలతో సహకరించక వాటి ఉత్సాహాన్ని భగ్నంచేయడానికి ప్రయత్నించారు. ఏదో కొన్ని కేసులలోమాత్రం వారిది పై చేయిగానున్నప్పటికినీ ఎక్కువగా గ్రామస్థులే జయించారు వారు తమ గ్రామ నిధులను ఏర్పరుచుకో గలిగారు అవి వారికి బాగా ఉపయోగపడ్డాయి చివరకు చాలామంది వడ్డీ వ్యాపారస్థులు తమ పట్టు వదలవలసివచ్చింది వారు తమ వడ్డీరేటును తగ్గించి, యిపుడు ఇతర గ్రామస్థులతో సహకరిస్తున్నారు.

గ్రామదానోత్తర కార్యక్రమంకూడా ప్రారంభమైనది గాంధీగారి నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్న గాంధీస్మారకనిధి, కస్తూర్బాగాంధీ జాతీయ స్మారకనిధి, ఖాదీగ్రామోద్యోగ కమీషన్, తదితర ఖద్దరు సంస్థలు, హరిజనసేవక సంఘము మొదలైన అఖిలభారత సంస్థలు గ్రామదాన క్షేత్రాలలో తమశాఖల నేర్పాటుచేసి చాలా గ్రామ సమూహాలను తమవశంలోనికి తీసుకొన్నాయి అచ్చట అవి తమ తమ కార్యక్రమాలను ప్రవేశపెట్టి గ్రామాలసాధారణాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఉదాహరణకు ఖద్దరుసంస్థలు ఖద్దరుపనిని ప్రారంభిస్తే కస్తూర్బా నిధివారు స్త్రీలపట్ల పిల్లలపట్ల ప్రత్యేకశ్రద్ధ వహించారు.

వికాస కార్యక్రమాలు నడపడానికి గ్రామదాన గ్రామాలలోకూడా ప్రజా సంస్థలు ఏర్పడ్డాయి. మద్రాసులో గ్రామస్వరాజ్య సహకారసంస్థలు, సంఘాలు, అస్సాంలో, ఒరిస్సాలో గ్రామదానసంఘాలు నెల

కొన్నాయి. సాధారణంగా ఈసంఘాలు శాఖ స్థాయిలోనుండి గ్రామదాన గ్రామాల ప్రతినిధులతో ఏర్పడతాయి. ఈ సంఘాలు సొసైటీల రిజిస్ట్రేషన్ ఆక్టు క్రింద రిజిష్టరై ఉంటాయి ఇతర ప్రదేశాలలోకూడా ఇటువంటి సంఘాలు ఏర్పరచబడుతున్నాయి. కు గ్రామాల్లో ఈ సంఘాలు వ్యవసాయోత్పత్తిని పెంచడంలోను, మార్కెటింగ్ ఏర్పాట్లు చేయడంలోను చాలా ఉపకరించాయి.

సహకార సంఘాలు గుజరాత్ లోకూడా చాలా ప్రయోజనకారిగా ఉన్నాయి. అచట అవి గ్రామస్థులకు ఎక్కువ లాభకారిగా నుండుటకుగాను వ్యవసాయోత్పత్తులన్నిటికి మార్కెటింగ్‌ను చేపట్టాయి కొంచెం తక్కువ స్థాయిలో కోరాపుట్ లోకూడా అలాగే జరిగింది

1957 లో జరిగిన ఎల్వాల్ కాన్ఫరెన్సులో గ్రామదానోద్యమానికి, భారత ప్రభుత్వం ప్రవేశపెట్టిన సమాజ వికాసోద్యమానికి మధ్య చాల సన్నిహితమైన సహకారం ఉండాలని తీర్మానించబడింది. ఈమధ్యనే 25 కేంద్రీకృత క్షేత్రాలకు (intensive areas) సంబంధించిన యోజన (ప్రాజెక్టు) ఒకటి సమాజవికాస మంత్రాలయం, సర్వసేనా సంఘముల పరస్పర సహకారంతో ప్రారంభించబడింది. ప్రతి క్షేత్రంలో సుమారు 5,000 జనాభా, రమారమి 5,000 ఎకరాలభూమి ఉండి ఒకదాని కొకటి చేరిఉన్న గ్రామాలు చాలా ఉంటాయి. వ్యవసాయం, కోళ్ళపెంపకం,

పశుపోషణలలో ఉత్పత్తిని పెంచడమే ఆ యోజన ప్రధానలక్ష్యం.

జనరల్ పాలసీగా ఖాదీ గ్రామోద్యోగ కమిషన్ వారు తమ ఖద్దరు విస్తరణకు గ్రామదాన క్షేత్రాలనే ఎంచుకోవాలని నిర్ణయించుకొన్నారు. బ్రిటన్‌లోని 'లేమిపై యుద్ధం' (war on want) ఉద్యమం బడుగు (under developed) దేశాల గ్రామవికాస కార్యక్రమాలకు సహాయాన్ని అందివ్వడంకోసం అంకితమైన ఒక స్వచ్ఛందోద్యమం (volunteer movement). అది గ్రామదానోద్యమంలో ఆసక్తితో యింతవరకు 400 గ్రామాలకు ఒక్కొక్క గ్రామానికి సగటున రు 6,000 చొప్పున మొత్తం 24 లక్షల రూపాయల విరాళం ఇచ్చింది ఆ సంస్థవారు అభ్యుదయ వ్యవసాయ పద్ధతుల శిక్షణ మొదలైన మరికొన్ని కార్యక్రమాలకు కూడా విరాళాలరూపంలో సహాయాన్ని అందజేస్తున్నారు. 'లేమిపై యుద్ధం' వారి సహాయం నీటిపారుదల వసతుల యేర్పాటు చేయడానికి, సహకారసంస్థలకు ధనాన్ని సమకూర్చడానికి, లఘుపరిశ్రమలు ప్రారంభించడానికి వినియోగించబడుతున్నది.

భారత ప్రభుత్వంవారు గ్రామదాన గ్రామాలకు గ్రాంట్లు, అప్పులు ఇచ్చుటకుగాను ఒక కోటిరూపాయలు కేటాయించారు. ఇంతవరకు ఆ మొత్తాన్ని పూర్తిగా వినియోగించడానికి అవకాశం లేకపోయింది. చాలా రాష్ట్రాలలో ఆయా రాష్ట్రప్రభుత్వాలుకూడా చాలా సహాయ

పడుతున్నాయి కొన్ని రాష్ట్రాలలో గ్రామదానచట్టాలు ఏర్పడ్డాయి మరికొన్నిటిలో అట్టి బిల్లులు చట్టరూపానికి వేచియున్నాయి. మద్రాసు ప్రభుత్వంవారు గ్రామదాన గ్రామాలకు ఇతర ఆర్థికవనరులు లేనప్పుడు అప్పిచ్చుటకు గాను పెద్దమొత్తాలను ఏర్పాటు చేశారు. ఒరిస్సా ప్రభుత్వం వారు వ్యవసాయోన్నతికిగాను ఇప్పటివరకు సుమారు 500 గ్రామదాన గ్రామాలమీద రమారమి 25 లక్షల రూపాయలు గ్రాంటురూపంలో వెచ్చించారు.

ఈ సహాయాలన్నీ చాలా ఉదారంగా ఇవ్వబడినప్పటికి గ్రామదాన గ్రామాలలోని ఎక్కువ అవసరాలు తీర్చడానికి అవి సరిపోవు. లక్షలాది గ్రామాలు గ్రామ దానంగా వచ్చినమీదట భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలుకూడా గ్రామీణప్రాంతాలకు అత్యధిక ప్రాముఖ్యాన్ని ఇస్తూ తమ పాలసీలను సమూలంగా మార్చవలసి ఉంటుంది గ్రామాలలోని వనరులన్నీ సమీకరించబడితే తప్ప కేవలం ప్రభుత్వసహాయంవల్ల ఎక్కువపని జరుగదు. అందుకుగాను పల్లెలలో తిరిగి వాటిని చైతన్యవంతం చేసే కార్యకర్తల సేనావాహిని కావాలి. అట్టి కార్యకర్తలను చేర్చుకొని వారికి తగు శిక్షణనిచ్చే కార్యక్రమాలు రూపొందించబడుతున్నాయి. అవి శాంతి సేవా దళాలుగా ఏర్పరచబడుతున్నాయి. ఇందుకుగాను గతసంవత్సరం

ఒరిస్సాలో ఏర్పాటుచేసిన 28 క్యాంపులలో 1,500 ల మంది గ్రామీణులు పాల్గొన్నారు. ఈ సంవత్సరం అట్టి శిక్షణ కేంద్రాలు భారతదేశం అంతటా ఏర్పరచ బడతాయి.

# ఏడవ అధ్యాయం

## ఖద్దరు

1919 సంవత్సరంలో గాంధీగారు భారతదేశపు దారిద్ర్యాన్ని ప్రత్యక్షంగా చూచినపుడు ఖద్దరు ఉద్యమాన్ని తలపెట్టారు క్రమేణా అది పెరిగి ఇతర గ్రామ పరిశ్రమలు దానికి జోడించబడ్డాయి ఖద్దరు నెమ్మదిగా ఒక అహింసాత్మక సామాజిక వ్యవస్థకు చిహ్నంగాను, దాని ఆర్థిక చింతనకు కీలక స్థానంగాను రూపొందింది.

ఖద్దరు ఉద్యమాన్ని వ్యాపింపజేయడానికిగాను 1925 వ సంవత్సరంలో అఖిలభారత చరఖా సంఘం, గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించడానికిగాను 1935 వ సంవత్సరంలో అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘం స్థాపించబడ్డాయి. ఈ రెండు అఖిలభారత సంస్థలకుతోడు వందలాది యితర స్థానికసంస్థలుకూడా ఈ కార్యక్రమాలను చేపట్టాయి. 1946 వ సంవత్సరానికి ఖద్దరు గ్రామీణ పరిశ్రమలవల్ల మొత్తం ఒకకోటి ఆరులక్షల రూపాయల విలువగల ఉత్పత్తి జరిగింది.

అది స్వరాజ్యం రావడానికిముందు విషయం. స్వరాజ్యం వచ్చినతరువాత ఈ కార్యక్రమాలను పెంపొందింపజేయడంకోసం భారతప్రభుత్వంవారు అఖిలభారత ఖాదీ గ్రామోద్యోగ కమిషన్‌ను నెలకొల్పారు. దానికి సలహా

నిచ్చుటకు ఒక బోర్డుకూడా ఉంది అదేవిధంగాను వివిధ రాష్ట్రాలుకూడ రాష్ట్రబోర్డులను ఏర్పరిచాయి. దేశం మొత్తంమీద యిప్పుడు ఖద్దరు గ్రామీణ పరిశ్రమల కార్యంలో చిన్నవి, పెద్దవి మొత్తం రెండువేలకుపైగా స్వచ్ఛందసంస్థలు పనిచేస్తున్నాయి మొత్తం ఖాదీఉత్పత్తి, అమ్మకం 1965 వ సంవత్సరంలో 20 98 కోట్ల రూపాయల మేరకు, 1966 వ సంవత్సరంలో 21-12 కోట్ల రూపాయల మేరకు జరిగింది. అలాగే గ్రామపరిశ్రమల విషయంలో వరుసగా 35 55 కోట్ల రూపాయలు, 34 77 కోట్ల రూపాయల మేరకు వ్యాపారం జరిగింది ఈ పనులకుగాను పెట్టిన మొత్తం పెట్టుబడి సుమారు 170 కోట్ల రూపాయలు. అందులో అధికభాగం కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలదే

కొన్ని సత్యాలను పరిశీలించినట్లైతే ఖద్దరు ప్రాముఖ్యం దానంతటదే మనకు తేటతెల్లం అవుతుంది.

ప్రస్తుతం భారతదేశంలో 47 కోట్ల జనాభా ఉంది. ఇందులో 85 శాతం వ్యవసాయంమీద ఆధారపడి ఉన్నారు వ్యవసాయం సంవత్సరం పొడుగునా వాళ్ళకు పనికల్పించదు తరచు సగంకాలం వారు పనిలేకుండానే ఉంటారు. సగంకాలంమాత్రమే పనిచేసేవారెప్పుడూ ఉన్నతస్థితిలో ఉండలేరనేది సుస్పష్ట విషయం. వారు వృధాచేసే సమయాన్ని వినియోగపరచడానికి వారికి మరొకవృత్తి కావాలి. లేక ప్రత్యామ్నాయంగా కొంత

మందిని వ్యవసాయంనుండి తప్పించి వారికి మరొకపని యివ్వాలి

ఇతర దేశాలలో చాలా తక్కువమంది వ్యవసాయం మీద ఆధారపడి ఉంటారు. జపానులో మొత్తం జనాభాలో 40 శాతం, అమెరికాలో మొత్తం జనాభాలో 15 శాతం మాత్రమే వ్యవసాయంమీద ఆధారపడి ఉంటారు. ఆ పద్ధతిని మనదేశంలోకూడా ఎందుకు ప్రయత్నించకూడదు?

అందుకని స్వరాజ్యం వచ్చినతరువాత మన నాయకులు పట్టణాలలో భారీపరిశ్రమలు నెలకొల్పి పల్లెలనుండి కొంతజనాభాకు వృత్తి కల్పించి పట్టణాలకు తరలిస్తే బాగుంటుందని తలపోశారు అందువలన ఏమిజరిగింది?

1950-51 నుండి 1959-60 సంవత్సరములమధ్య కాలంలో శరీరపాటవం కలిగియుండి పనికావలసినవారి సంఖ్య 3 కోట్ల 20 లక్షలకు పెరిగితే వారిలో 11.8 లక్షల మందికి మాత్రం భారీపరిశ్రమలలో పని లభించింది. అంటే 320 లక్షల మందిలో 4 శాతంమందికి మాత్రం పని దొరికింది. మిగిలిన 96 శాతంమంది వారి వృత్తులకు ముఖ్యంగా వ్యవసాయానికి వదలివేయబడ్డారు. ఇందులో 1950 వ సంవత్సరానికి పూర్వం పూర్తిగాగాని, కొంతకాలంగాని నిరుద్యోగులుగా ఉంటూఉన్న కోట్లాది ప్రజలసంఖ్య చేర్చబడలేదు

అటువంటప్పుడు ఇరవైరెట్ల ప్రజలకు పనికల్పించేందుకు వీలుగా భారీపరిశ్రమలను ఇరవైరెట్లు ఎందుకు పెంచగూడదు? పెంచలేము ఎందుకంటే అందుకు కావలసిన సొమ్ము మనదగ్గరలేదు గనుక. ఉదాహరణకు ఒకకోటి రూపాయలకుపైగా విలువచేసే బట్టలమిల్లు సుమారు 5 వేల మందికి పనికల్పిస్తుంది అంటే ఒకమనిషికి పనికల్పించాలంటే ఇరవైవేల రూపాయల పెట్టుబడి కావాలి ఈ లెక్క ప్రకారం మొత్తం నాలుగుకోట్లమంది నిరుద్యోగులకు పని ఇవ్వాలంటే సుమారు 80 వేలకోట్ల రూపాయల పెట్టుబడి కావాలి కాని యింతవరకు భారీపరిశ్రమలు తదితర భారీ వ్యాపారసంస్థలమీద పెట్టుబడిపెట్టిన మొత్తంసొమ్ము 5 వేల కోట్ల రూపాయలకన్న తక్కువగానే ఉన్నది.

అందువల్ల వీరందరికి పని కల్పించేందుకు వేరే మార్గాలు చూడవలసి ఉన్నది అందుకు ఒకేఒక ఆచరణ యోగ్యమైన ఉపాయం ఉన్నది. అది తక్కువ పెట్టుబడితో ఎక్కువ మానవశక్తి నుపయోగపరచే లఘుపరిశ్రమల స్థాపన. అంబర్‌చర్కా పరిశ్రమలో ఒకమనిషికి పనికల్పించడానికి సుమారు రు 250/- లు కావాలి అలాగే సుమారు మూడువందలరూపాయలు ఒకమనిషికి చేమగ్గంమీద పని కల్పిస్తాయి. ఇటువంటి సులభోపాయాలద్వారా పూర్తిగాగాని, కొంతకాలంగాని నిరుద్యోగులుగాఉండే కోట్లాది ప్రజలకు పనికల్పించవచ్చును

పెద్ద ఫ్యాక్టరీలలో తయారయ్యే వస్తువుల ధరలకన్న యిటువంటి చిన్న పరిశ్రమలద్వారా తయారయ్యే వస్తువుల ధరలు కొంచెం హెచ్చుగానే ఉంటాయి. ఎందు కంటే తయారైన ప్రతిగజం బట్టమీాద, ప్రతి కిలోగ్రాం నూనెమీాద మానవ కాయకష్టం అధికంగా ఉంటుంది గనుక. దీనిని మరొకవిధంగాకూడ పరిశీలించవచ్చు

500 జనాభాగలిగిన ఒక గ్రామాన్ని తీసుకొందాం. ఒకమనిషికి రు 20 ల చొప్పున మొత్తం పదివేలరూపా యల విలువచేసేబట్ట ప్రతిసంవత్సరం అచట కావలసి ఉంటుంది. ఇందుకోసం ప్రజలు ధాన్యం, గోధుమలు, పప్పులు మొదలైన వ్యవసాయోత్పత్తులను అమ్మి సొమ్ము సంపాదిస్తూ ఉంటారు. ఆ గ్రామం తనకు కావలసిన బట్టను తానే ఉత్పత్తిచేసుకోవడం ప్రారంభించిందనుకోండి అప్పుడు గ్రామస్థులు తమ తీరికకాలాన్ని వస్త్రోత్పత్తికి వినియోగిస్తారు. దానివలన ఏటావారు బట్టకు ఖర్చుచేసే పదివేల రూపాయలలోనుండి ప్రత్తి వగైరాలఖర్చు క్రింద సుమారు రు 2,500 లు పోను మిగిలిన రు 7,500లు మిగుల్చు కొంటారు ఈ సొమ్ము ఆగ్రామం చెల్లించే భూమి పన్నుకు (land revenue) కనీసం 6 నుండి 8 రెట్లుంటుంది.

అలాగే పంచదార, నూనె, సబ్బులు, జోళ్ళు, కాగితం మొదలైన యితర నిత్యావసర వస్తువులుకూడా ఒక్కొక్కటే తీసుకొంటే వాటికి కావలసిన ముడివస్తువులు పల్లెలలోనే దొరుకుతుండడంవలన గ్రామ పరిశ్రమల

ద్వారా ప్రతి గ్రామం ఎంత సొమ్ము ఆదాచేసుకొన వచ్చునో మనం ఊహించుకోగలం.

పూర్తిపని సంవత్సరం పొడవునా ఉండి వేరే యితర పనులేవియూ చేయవలసిన అవసరంలేనివారు "మేము ప్రతి వస్తువు కొనుక్కొనవలసిఉంది అటువంటప్పుడు హెచ్చు ధరపెట్టి ఖద్దరు మొదలైనవి ఎందుకు కొనాలి? అలా కొనడంవల్ల మాకు నష్టంకాదా?" అని అనుకోవచ్చును. దానికి సమాధానం ఏమంటే నేడు లక్షలాది ప్రజలు పని లేనివారుగా ఉంటున్నారు. ఎందుకంటే వారు తయారుచేసే వస్తువులు చాల కొద్దిమందిమాత్రమే కొంటున్నారు. వారిలో చాలమంది దగ్గర దగ్గరగా పస్తుపడి ఉండేపరిస్థితిలో ఉన్నారు అట్టివారికి ఉచితసహాయాన్ని అందజేయడానికై ప్రభుత్వం కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టవలసి వస్తుంది. ఆ సొమ్ము మన జేబులనుండే వస్తుంది. సమాజవాద వ్యవస్థకు ప్రయత్నించే ప్రతి సభ్యదేశంలోను బ్రిటన్, అమెరికాలలోవలె ప్రతి ఒకరికీ లాభసాటియైన పనియైనా కల్పించబడాలి లేదా వారికి తిండీ, బట్టా సంఘంనుండియైనా లభించాలి. దయాధర్మబిచ్చంగా ఇచ్చే సహాయంకన్న కొంచెం హెచ్చుధర అయినా వారు తయారుచేసిన వస్తువులు కొని వారికి పనికల్పించి సహాయపడటం ఉత్తమపద్ధతి ఎందుకంటే పని ఆత్మగౌరవాన్నిస్తే దయాధర్మబిచ్చం దానిని హరిస్తుంది.

అందుచేతనే సర్వోదయోద్యమం అట్టివారు తయారుచేసే వస్తువులను కొంచెం ఎక్కువ ధరకైనాసరే కొనవలసినదిగా అందరిని కోరుతున్నది హెచ్చుగా ఇచ్చిన సొమ్ము సాటి సోదరుల ఆత్మగౌరవార్థం దానంగా ఇచ్చినట్లు భావించుకొన్నను తప్పులేదు. అలాకాకుండా ప్రభుత్వమే నిరుద్యోగులందరికి బిచ్చగాళ్ళవలె ఉచిత సహాయం అందజేసి పోషించాలంటే ఆ బిచ్చపు సొమ్మును మనమే అధికపన్నులద్వారా ప్రభుత్వానికి ఇవ్వవలసిఉంటుందనే విషయాన్ని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి

సర్వోదయోద్యమం సమాజాన్ని సహానుభూతి, స్వేచ్ఛాపూర్వకక్రియల (Compassion and volutary action) పునాదిమీద రూపొందించాలని ప్రయత్నిస్తూ వున్నది కష్టంలో ఉన్నవారినిచూస్తే మనకు జాలికలిగి హృదయం ద్రవిస్తుంది. అపుడు వారికేమైన సహాయంచేయడానికి మనం ప్రయత్నిస్తాం. అదే సహానుభూతితో కూడిన స్వేచ్ఛాపూర్వకక్రియ చాలమంది యీ ప్రకారంచేస్తే హృదయార్ద్రితతో సమృద్ధమైన ఒక ఆదర్శ మానవసమాజం ఏర్పడుతుంది.

ఈ ప్రకారంగా ఖద్దరు, గ్రామీణ పరిశ్రమలకు సహాయంచేయడం అంటే భూదానం, గ్రామదానంవలెనే పరోక్షరూపంలో స్వేచ్ఛాపూర్వకంగా సమాజ వికాస కార్యక్రమంలో పాలుపంచుకోవడమే.

ఖద్దరు, గ్రామీణపరిశ్రమల వస్తువుల వెలలను వాటి మూలసిద్ధాంతాలకు భంగంకలగని విధంగా వీలైనంత తగ్గించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ విధంగా నేడు పాతకాలపు రాట్నంమీదవచ్చే నూలుకు ఆరునుండి ఎనిమిదిరెట్లు ఎక్కువ నూలునిచ్చే అంబర్ చర్ఖా మనకున్నది. అలాగే ఇతర గ్రామీణ పరిశ్రమలలో కూడ ఎక్కువ ప్రయోజనకరమైన పనిముట్లు, సాధనాలు ప్రవేశపెట్టబడ్డాయి అందుబాటులో ఉన్నప్పుడు విద్యుచ్ఛక్తికూడ కొన్ని ప్రక్రియలలో ఉపయోగించబడుతున్నది. కాని దానివలన నిరుద్యోగం పెరగకుండాను, కాయకష్టానికి అది సహాయకారిగా ఉండి ఉత్పత్తిని పెంచే విధంగాను తగు జాగ్రత్త తీసుకొనబడుచున్నది. మెరుగుపరచిన మగ్గాలుకూడ అధికతర ఫలాన్ని ఇస్తున్నాయి ఇంకా ఉత్తమమైన సాధనాలు, పనిముట్లు సంపాదించడానికి ఎడతెగని పరిశోధనలు, పరీక్షలు జరుగుతూనే ఉన్నాయి.

అయినప్పటికీ చాలమంది వీటి వెలలు అధికంగానే ఉన్నాయని అనుకొంటున్నారు. అందుకని ప్రభుత్వ సహాయం అర్థించబడింది ప్రభుత్వంవారు ఖద్దరువెలమీద 19 శాతం సబ్సిడీ యివ్వడంవల్ల కొనుగోలుదారు రూపాయిలో 81 పైసలు మాత్రమే యివ్వవలసిఉంటుంది అప్పటికీ మిల్లుబట్టకంటె ఖద్దరువెల ఏమాత్రమో హెచ్చుగానే ఉంటూఉన్నది. దేశంలో ఏటా 15 లేక 16 కోట్ల రూపాయలు విలువచేసే ఖద్దరు కొనేవారున్నారు. అయినప్పటికి

అది సముద్రంలో నీటిబొట్టు వంటిది. ఖద్దరు, గ్రామీణ పరిశ్రమలమూలంగా సుమారు 30 లక్షలవరకు వడుకు వాండ్లకు, నేతగాండ్లకు, ఇతర పనివాండ్లకు పూర్తిగాగాని, కొంతకాలంగాని వృత్తి లభిస్తూ ఉన్నది. అయినా అంతకు ఇరవైరెట్లకుపైగా పనికావలసినవారున్నారు. మొత్తం దేశంయొక్క వస్త్రావసరాన్ని తీర్చేందుకుగాను ఖద్దరు ఉత్పత్తి నూరురెట్లు పెరగవలసిన అవసరం ఉన్నది

ఇంతవరకు ఖద్దరు, గ్రామీణ పరిశ్రమల పనులు అందుకొరకై అంకితమైన కొద్దిమంది కార్యకర్తలద్వారానే జరుగుతున్నాయి అలాకాకుండా గ్రామప్రజలు వాటిని చేపట్టినపుడే అవి ప్రతిగ్రామానికి అందుబాటులో ఉండే లాగున వ్యాప్తిచెందుతాయి

ఇందుకొరకై రెండేండ్లక్రితం వినోబాజీ సలహా ప్రకారం ఖద్దరు నీతిలోను (policy), పద్ధతిలోను (method) మార్పు ప్రవేశపెట్టబడింది. ఇకమీదట పూర్తిగ్రామాలు (whole villages) తమకు కావలసిన ఖద్దరును తామే ఉత్పత్తి చేసుకొనవలసి ఉంటుంది ఖద్దరుమీద గవర్నమెంటువారిచ్చే సబ్సిడి ఉచితనేత ప్రణాళిక (free weaving scheme) గా మార్చబడింది

ఈ ప్రణాళిక ప్రకారం చేవడుకునూలును బట్టగా నేసేందుకు అయ్యేఖర్చు అంతా ప్రభుత్వమే భరిస్తుంది. దానివల్ల స్వంతంగా ప్రత్తి పండించుకొని విరామ సమయా

లలో నూలు వడుకుకొనే గ్రామస్థునికి తన బట్టకొరకై నగదురూపంలో ఏమీ ఖర్చు పెట్టనక్కరలేదు.

ఈ క్రొత్త ఖాదీ ప్రణాళికావ్యాప్తికి అన్నిటికన్న ఎక్కువ అనుకూలమైన స్థలాలు సుస్పష్టంగా గ్రామదాన గ్రామాలే.

ఖద్దరు, గ్రామీణపరిశ్రమలు లేకుండా గ్రామాల ఆర్థిక పునరుద్ధరణ జరగనేరదు త్రివిధ కార్యక్రమంలో ఖద్దరు మాత్రమే ఉదహరించబడినదంటే అది తదితర గ్రామీణ పరిశ్రమలన్నిటి ప్రతినిధిగా వ్యవహరిస్తున్నదన్న మాట. అంతేకాని మిగిలినవాటికి ప్రాముఖ్యత లేదని కాదు దాని అర్థం.

ప్రతిగ్రామంలోని గ్రామసభ ఆ గ్రామానికి కావలసిన బట్టను ఏడాది, ఏడాదిన్నరలోగా తయారుచేసుకొంటామని ప్రతినబూనాలి. దేశంలో ఖద్దరు ఉత్పత్తికి చాలా సంస్థలు పనిచేస్తున్నాయి గ్రామసభ కోరినట్లయితే వాటిలో స్థానికంగా ఉన్న సంస్థ ఆ గ్రామంలో ఖద్దరుపనిని ప్రారంభించడానికి సహాయపడుతుంది.

ఇంతకుపూర్వం చెప్పినట్లుగా 500 మంది జనాభా గల గ్రామానికి ఈ గ్రామ ఖద్దరుత్పత్తి ప్రణాళికవల్ల గ్రామం మొత్తంమీద బట్టకు అయ్యే సాలుసరిఖర్చులో రు 7,500 లు ఆదా అవడమేకాకుండా ఖాదీగ్రామోద్యోగ కమిషన్‌వారు నేత మజూరీక్రిందయిచ్చే రెండువేలపైచిలుకు

రూపాయలుకూడ ఆ గ్రామ నేతగాండ్ర మజూరీ క్రింద ఆ గ్రామానికే దక్కుతాయి.

ఆ గ్రామంలో నేతగాండ్రెవరూ లేనట్లయితే బయట నుండి యెవరినైనా తీసుకొనివచ్చి అచ్చట వారికి స్థావర మేర్పరచవచ్చును లేదా గ్రామస్థులలోనే కొంతమంది నేతపని నేర్చుకొని ఆ వృత్తిని చేపట్టవచ్చును ఇందుకు కావలసిన ఆర్థిక, సాంకేతిక సహాయాన్ని అఖిలభారత ఖాదీగ్రామోద్యోగ కమిషన్ వారు అందజేస్తారు

## ఎనిమిదవ అధ్యాయం

# ఖద్దరు యొక్క విస్తృత ప్రాముఖ్యం

నిత్యం పెరుగుతున్న ధరలు, అధిక లాభాపేక్ష నేడు మన దేశాన్ని పీడిస్తున్న జాడ్యాలు. వాటిని అరికట్టడంలో ఖద్దరు, గ్రామీణపరిశ్రమలు చాల ప్రముఖమైన పాత్ర వహిస్తాయి. అదుపులేని ధరల పెరుగుదలకు ఉక్కు కర్మాగారాలు, చలన యంత్రాగారాలు, తదితర భారీపరిశ్రమలు నిర్మించడంకోసం అవిచ్ఛిన్నంగా ఎక్కువసొమ్ము ఖర్చుపెట్టుతూ ఉండడం ఒక కారణం దేశశ్రేయస్సుకు ఆ పనులన్నీకూడా అవసరమే. కాని ఆ శ్రేయస్సుకు నాటి తోడ్పాటు చాల సంవత్సరాల తర్వాతగాని కన్పడదు. ఈలోగా ప్రజలకు కావలసిన నిత్యావసర వస్తువులను అవి తయారుచేయలేవు. కాని వాటిమీాద ఖర్చుచేసే సొమ్ము మాత్రం కూలీలు, గుమాస్తాలు, ఆఫీసర్లు, కంట్రాక్టర్లు మొదలైన చాలమంది వద్దకు చేరుతున్నది. దానితో వారు ఎన్నో వస్తువులు కొనడానికి ప్రయత్నిస్తారు. ఈ విధంగా కొనడానికి దొరికే వస్తువులకన్న వాటినికొనే ధనరాశి ఎక్కువకావడంవలన ఆ వస్తువుల ధరలు పెరుగుతాయి

దీనిని అరికట్టాలంటే నిత్యావసర వస్తువుల ఉత్పత్తిని పెంచాలి. అది గ్రామీణ పరిశ్రమలద్వారానే సాధ్యమవుతుంది. మన దేశంలో స్వస్థశరీరులైయుండి పూర్తిగాగాని,

కొంతకాలంగాని, పనిలేకుండా ఉండేవారు కోట్లకొలది ఉన్నారనే విషయం మనం గత అధ్యాయాలలో గమనించాం. ఈవిధంగా వృధా అయ్యే మానవశక్తి సుమారు 10 కోట్లమంది పూర్ణకాల పరిశ్రమకు (Full time labour) సరిపోతుందని అంచనా వేయబడింది. ఒకరోజుకూలి కనీసం ఒకరూపాయిగ లెక్కించినప్పటికికూడా సంవత్సరంమొత్తం లో దానిమీద వచ్చేనష్టం సుమారు 3,500 కోట్ల రూపాయలుంటుంది ఇది చాలా పెద్దమొత్తం. ఇంతకుపూర్వం మనం గమనించినట్లుగా ఖద్దరువంటి లఘుపరిశ్రమలు మాత్రమే అంతమంది ప్రజలకు పనిని కల్పించగలవు. వాటిని విస్తృతంగా అమలుపరచినట్లైతే కొన్నివేల కోట్ల రూపాయల ఉత్పత్తి పెరిగి రోజురోజుకూ పెరిగిపోతూఉండే ధరలను అరికట్టడం సాధ్యమవుతుంది.

ధరల పెరుగుదలకు మరొక కారణం అధిక లాభాపేక్ష. బట్ట, పంచదార, నూనె, సబ్బులు మొదలైనవాటిని తయారుచేసే ఫ్యాక్టరీలు, వాటి వ్యాపారం ప్రయివేటు యాజమాన్యంలోనే ఉన్నాయి. స్వాభావికంగానే వాటి యజమానులు వీలయినంత యెక్కువలాభం సంపాదించాలని కోరుకొంటారు. ప్రభుత్వం వాటిని అదుపులో పెట్టడానికి కంట్రోళ్ళద్వారా కొంత ప్రయత్నం అయితే చేస్తున్నది కాని ఆ ప్రయత్నాలు తరచు ఫలప్రదం కావడం లేదు. కంట్రోళ్ళవల్ల కొద్దిమంది ఉద్యోగులచేతిలో అధి

కారం కేంద్రీకృతం కావడంమూలాన అవినీతి, దుర్వ్యవస్థ ఎక్కువవుతున్నాయి

ఉక్కు, విద్యుచ్ఛక్తి, భారీపరికరాలు మొదలైన పరిశ్రమలను ప్రభుత్వం జాతీయం చేసింది. నిత్యావసర వస్తువులనుకూడా జాతీయంచేయవలసినదేనా? జాతీయం అనగా స్టేట్ యాజమాన్యం ప్రభుత్వంచేతిలో అపారమైన అధికారాన్ని కేంద్రీకరింపజేస్తుంది. అలా అధికారాన్ని అపారంగా కేంద్రీకరించడం ప్రమాదకరం. జాతీయం చేయబడిన పరిశ్రమలను ప్రభుత్వ ఏజెంట్లు నడిపేతీరు ప్రజలలో నమ్మకాన్ని పుట్టించలేకపోతున్నది దానిలో విపరీతమైన అసమర్థత, అజాగ్రత కనిపిస్తున్నాయి

వీటినుండి బయటపడడానికి ఒకే ఒకమార్గం నిత్యావసర వస్తువుల ఉత్పత్తి, పంపకం ప్రజల చేతులలో ఉంచడం ఇక్కడకూడా ఖద్దరు, గ్రామీణపరిశ్రమలే వస్తాయి. గ్రామాలు, పట్టణాలలోని ప్రజలు తమకు కావలసిన వస్తువుల ఉత్పత్తి, అమ్మకం (Marketing) గ్రామసభలద్వారాగాని, స్థానిక సహకారసంస్థలద్వారాగాని చేసుకుంటాయి. ఆ గ్రామసభలు, స్థానిక సహకారసంస్థలు యూనియన్లు ఫెడరేషన్ల రూపంలో ఉన్నతస్థాయి (Higher level)లో కూడ తమ సంస్థలను ఏర్పాటు చేసుకుంటాయి. దీనివలన సరియైన ఆర్థికాధికారం (Economic control) ప్రజలచేతుల లోనికి వస్తుంది. అప్పుడు మిగిలిపోయిన ప్రయివేటు పారి

శ్రామిక వేత్తలు, వ్యాపారస్థులు ఆ ప్రజాసంస్థల పాలసీలకు తల ఒగ్గవలసి వస్తుంది.

నిజాని ధనవంతుల స్వలాభోపయోగాన్ని (Exploitation) అంతంచేయడానికి యిదొక్కటే గట్టిమార్గం. వినోబాజీ చెప్పినట్లుగా సమాజవాదులు, సామ్యవాదులు తాము ఏ పెట్టుబడి వర్గాన్నైతే నిర్మూలించాలని ప్రయత్నిస్తున్నారో అదే పెట్టుబడివర్గం తయారుచేసే వస్తువులను కొని ప్రోత్సహించడంద్వారా వారిని పోషిస్తున్నారుకూడా. కాని ఖద్దరు, గ్రామీణపరిశ్రమలు అలాకాదు. అవి మూలాన్ని ఛేదించడానికి ప్రయత్నిస్తాయి

నేటిరోజులలో ప్రజలెక్కువగా పట్టణాలలోనే కేంద్రీకృతం కావడానికి ఇచ్ఛగిస్తున్నారు. కొన్ని పాశ్చాత్యదేశాలలో 85 నుండి 90 శాతం ప్రజలు పట్టణాలలోనే నివసిస్తున్నారు అందుచేత పట్టణాలు ఎప్పటికప్పుడు క్రొత్త చిక్కు సమస్యలను సృష్టిస్తున్నాయి. నేరాలు, అవినీతి వాటిలో వృద్ధిచెందుతున్నాయి ప్రజారోగ్య రక్షణ, నీటి సప్లయి కఠిన సమస్యలైనాయి విపరీతమైన జనసమ్మర్దంవల్ల అనారోగ్యం తాండవిస్తోంది. పరిశుభ్రమైనగాలి, సూర్యరశ్మి ప్రజలకు కరువైనాయి. ఒక పేటనుండి మరొక పేటకు వెళ్ళడంకూడ ఒక సమస్యగా తయారైంది వీధులంతకంతకు విపరీతంగా జనసమ్మర్దంతో నిండిపోతున్నాయి

పల్లెలలో చాలా లాభాలున్నాయి అచట ప్రతి ఒక్కరు ఒకరికొకరు పరిచితులై ఉండి ఒకరికొకరు సాయ పడుతూ ఉంటారు అచట కావలసినంత ఖాళీస్థలం, పరిశుభ్రమైనగాలి, సూర్యరశ్మి ఉంటాయి నేరం, అవినీతి అక్కడ అంత తీవ్రమైన సమస్యలు కానే కావు కాని అచటి అపరిశుభ్రత, బీదరికం, నిరుద్యోగం, ఏకాంత వాసం ఉత్సాహవంతులైన కార్యశూరులను పల్లెలనుండి దూరంగాపోయి పట్టణాలలో తమ అదృష్టాలను పరీక్షించు కొనేలా చేస్తున్నాయి.

పల్లెల నీవిధంగా ఛిన్నాభిన్నం అయేలా కాకుండా వాటిని బలపరిచి, వాటిని పునరుజ్జీవింపజేయడమే సర్వోదయాదర్శ పట్టణాలలో ప్రజలను ఆకర్షించే కొన్ని సదుపాయాలున్నాయి ఇపుడిపుడు పల్లెలలోకూడా ఆ సదుపాయాలు లభిస్తున్నాయి. లభించాలికూడా పల్లెలను కూడా పరిశుభ్రంగా ఉంచి అచట కూడా మంచి పాఠశాలలు, ఆస్పత్రులు, గ్రంథాలయాలు మొదలైనవి నెలకొల్పవచ్చును రోడ్లు ఎక్కువగా బాగుచేసినట్లైతే అవి యికమీదట బయటప్రపంచంతో సంబంధంలేని దుస్థితిలో ఉండనక్కరలేదు. టెలిఫోనులు, రేడియోలు వాటిని బయటి ప్రపంచంతో ఎల్లప్పుడు కలిపి ఉంచుతాయి.

ఆధునిక పట్టణాల అభివృద్ధి పెద్దపరిశ్రమలమీద ఆధారపడి ఉన్నది. సాధారణంగా క్రొత్త పరిశ్రమలు పట్టణాలలోనే నెలకొల్పబడి పట్టణాల వైశాల్యాన్ని పెంచే

స్తున్నాయి. కాని సర్వోదయం పరిశ్రమలు పల్లెలలో పెరిగి పెద్దవికావాలని కోరుతున్నది. పరిశ్రమలు పల్లెలలో పెరిగినపుడు పల్లెలు అభివృద్ధి చెందుతాయి. చిన్న గ్రామీణ పరిశ్రమలు పెద్ద ఫ్యాక్టరీలంత సమర్థవంతంగానూ ఉంటాయి. ఇప్పుడు చాలా గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం లభించింది వీలైనంతత్వరలో ఆ సౌకర్యం ప్రతి పల్లెకూ లభించాలని వాంఛిస్తున్నాం అపుడు గ్రామీణ పరిశ్రమల తాలూకు కొన్ని ప్రక్రియలకు దానిని ఉపయోగించడంద్వారా కాయకష్టాన్ని కొంత తగ్గిస్తూ ఉత్పత్తిని పెంచవచ్చును. ఎక్కువ ఉత్పత్తి సాధనాలను, పనిముట్లను, చిన్నతరహావే అనుకోండి - పరిశోధనద్వారా, అనుభవం వల్ల అభివృద్ధిపరచి గ్రామాలలో ప్రవేశపెట్టవచ్చును. వీటి వలన నిరుద్యోగం, అసమానత, స్వలాభోపయోగం మొదలైనవి రాకుండా గ్రామప్రణాళికలు, ప్రాంతీయ యోజనలు జాగ్రత్త వహిస్తాయి.

గ్రామాలలో ప్రజలు తమ యిండ్లదగ్గరగాని, యిండ్ల లోపలగాని ఆహ్లాదకరమైన వాతావరణంలో పనిచేస్తారు. వారు పనిద్వారా అధికమైన ఆనందాన్ని సుఖవుగా శ్రమ నుండి విముక్తిని పొందుతారు పట్టణవాసులను కలవర పరిచే చింత, అశాంతి వారి దరిజేరవు ఇంటిలోను, బయటి ప్రపంచంలోను శాంతికి ఇదొక ముఖ్యసాధనం.

ఈవిధంగా వ్యవసాయం, పరిశ్రమలలో అధికభాగం ఉంటాయి. పట్టణాలలో కొన్ని భారీపరిశ్రమలు మాత్రమే

ఉంటాయి ఉక్కు-కర్మాగారాలు, చలనయంత్రపరిశ్రమలు, హార్బర్లు, నౌకానిర్మాణం మొదలైనవన్నీ భారీపరిశ్రమలు కావడంవల్ల అవి పట్టణాలలోనే ఉండాలి కాని అవి మరీ ఎక్కువగాను, మరీ పెద్దవిగాను ఉండకూడదు.

గ్రామాలకు, లఘుపరిశ్రమలకు ప్రాముఖ్యం లభింప జేసే యిటువంటి ఆర్థికవ్యవస్థే వికేంద్రీకృత ఆర్థికవ్యవస్థ. గ్రామసభను ఆధారంగా చేసుకొని అత్యధికమైన స్వపరిపాలనాధికారాలతోనుండు పరిపాలనా పద్ధతే వికేంద్రీకృత పరిపాలనా పద్ధతి. ఈ రెండూకలిసి వికేంద్రీకృత సమాజానికి ఆధారంగా ఉంటాయి వికేంద్రీకృత సమాజం మాత్రమే వ్యక్తికి అత్యధిక స్వాతంత్ర్యాన్ని, వికాసావకాశాన్ని ఇవ్వగలుగుతుంది అందుచేతనే సర్వోదయానికి ఇది చాలా ముఖ్యం.

సర్వోదయం కేవలం భారతదేశానికి మాత్రమే పరిమితమై ఉండదు. సర్వప్రపంచాన్ని ఇది పరివేష్టిస్తుంది. చివరకు ఎప్పటికైనా ప్రపంచమంతా ఒకటైతీరాలి. వినోబాగారి ఊహాపథంలో స్వపరిపాలనా యుతమైన పల్లెలు, పట్టణాలు ఒకవైపు, విశ్వరాజ్యం మరొకవైపు విహరిస్తున్నాయి. విభిన్న జాతీయ ప్రభుత్వాలు, ప్రాంతాలు మొదలైనవన్నీ కేవలం పరిపాలనా సౌలభ్యానికి అనువైన యూనిట్లుగా ఉండడంతప్ప ఏ టికి ఇతరమైన ప్రాముఖ్యం ఏమీ ఉండదు. అప్పుడు ప్రపంచప్రజలు యావన్మందీ

జాతి, మత, భాషా, రాజకీయభేదాలనుండి విడివడి "వసుధైవ కుటుంబకమ్" గా తయారవుతారు.

అటువంటి చక్కని విశ్వభవిష్యత్తుకు గ్రామదానం, ఖద్దరు, శాంతిసేన రాచబాటను ఏర్పాటు చేస్తాయి. మొదటి రెంటినిగూర్చి యింతవరకు విపులంగా చర్చించాం. ఇక మూడవదానిని గురించి ముందు అధ్యాయంలో చర్చిద్దాం.

## తొమ్మిదవ అధ్యాయం

# శాంతి సేన ఆదర్శం

1948 వ సంవత్సరం జనవరి 30 వ తేదీ సాయంత్రం సుమారు గం. 5–10 నిమిషముల సమయం క్రొత్తఢిల్లీలో బిర్లా భవనంలో గాంధీజీ ప్రార్థనాస్థలానికి చాల తొందరగా నడిచివస్తున్నారు. జాతీయ ప్రాధాన్యంగల కొన్ని ముఖ్యమైన సమస్యల చర్చలలో నిమగ్నులుకావడం మూలాన ఆరోజు కొంచెం ఆలస్యమైనది అందువల్ల వారు చాల తొందరలో ఉన్నారు

వారు ప్రార్థనాస్థలానికి చేరబోతుండగా మూడు గుండ్లు ప్రేలాయి. గాంధీజీ నేలకొరిగారు బాధతోకూడిన మూలుగుకాని, హంతకునిపట్ల క్రోధంగాని లేదు వారి పెదవులు దాటివచ్చిన శబ్దాలు రెండే రెండు అవి 'హే రామ్."

ఆవిధంగా గాంధీజీ, వినోబాజీ తర్వాత భావోద్వేగంతో చెప్పినట్లుగా, తనకర్తవ్య నిర్వహణలో ప్రాణాలర్పించి ప్రథమశాంతి సైనికులయ్యారు "వారు శాంతి సేనాధ్యక్షులుగా ఆజ్ఞలను ఇచ్చారు శాంతిసైనికులుగా వాటిని స్వయంగా శిరసావహించారు."

హింసాపూరితమైన అల్లర్లు, జగడాలు, ఉద్రేకాలు శాంతియుతంగా పరిష్కరించేందుకుగాను శాంతిసేవ ఒకటి

ఉంటే బాగుంటుందనే అభిప్రాయం గాంధీజీకి చాల సంవత్సరాలక్రితమే తట్టింది. వారప్పుడిట్లన్నారు.—“కొన్నాళ్ల క్రితం నేను పోరాటాలను, అందు ముఖ్యంగా జాతి, వర్ణ విద్వేషాలకు సంబంధించినవాటిని అరికట్టడానికి ప్రాణాలను సైతం అర్పించడానికి సంసిద్ధులుగా ఉండే కార్యకర్తలతో కూడిన శాంతిసేన నొకదానిని ఏర్పాటుచేయడంగురించి ప్రస్తావించాను పోలీసులు, సైన్యం స్థానేశాంతిసేన పని చేయాలనేదే దాని అభిప్రాయం ఇది అత్యాశగా కనిపించవచ్చును దానిని సాధించడం అసంభవంగాకూడ తోచవచ్చును. కాని కాంగ్రెసు అహింసా ఉద్యమాన్ని జయప్రదంగా నడిపించాలంటే హింసాయుత పరిస్థితులను అహింసాయుతంగా నిరోధించగలిగేశక్తి సామర్థ్యాలను ప్రదర్శించవలసి ఉంటుంది ”

స్వాతంత్ర్య ప్రాప్తికిముందు భారతదేశంలో తీవ్రమైన వర్గకలహాలు, (Communal riots) ప్రారంభమై దేశ విభజనతరువాత అవి తీవ్రతరమైనపుడు గాంధీజీ ఆ వర్గ విద్వేషాగ్నిని అహింసాశక్తితో చల్లార్చే ప్రయత్నంలో నిమగ్నులైనారు చివరకు ఆ ప్రయత్నంలోనే వారు తమ అసువుల నర్పించారు

వారి ఆత్మార్పణ భ్రాతృవిద్వేషాగ్నినయితే కొంత వరకు చల్లార్చగలిగింది కాని రకరకాలైన హింసాత్మక పోరాటాలు దేశాన్నింకా పీడిస్తూనే ఉన్నాయి భాషా భేదానికి సంబంధించిన వివాదాలు, మత విద్వేషాలు, వర్ణ

ద్వేషాలు దేశంలో తలలెత్తుతూనే ఉన్నాయి. అలాగే కార్మికోద్యమాలు, విద్యార్థి ఆందోళనలు, ప్రభుత్వ పాలసీలకు, నిర్ణయాలకు సంబంధించిన అసమ్మతి ప్రదర్శనలు మొదలయినవన్నీ హింసాయుతంగానే నడుస్తున్నాయి

వాటిని అణచడానికి పోలీసుబలాన్ని ఉపయోగించవలసి వస్తున్నది. పోలీసుల సహాయార్థం తరచు సైన్యాన్ని పిలిపించవలసి వస్తున్నది. ఈ దౌర్జన్యకాండలకు, పోలీసు చర్యలకు చాలా జీవాలు బలిఅయిపోయినాయి. ఆస్తినష్టం కూడా ఎక్కువగానే ఉన్నది. ఈ అంతర్విరోధాలు దేశాన్ని దుర్బలపరిచి దేశభద్రతకే ముప్పుతెస్తున్నాయి అవి దేశైక్యతకు ఒక సవాలుగాకూడా పరిణమించాయి పెరిగిపోతున్న పోలీసువ్యయం కాసారమునుబోలిన దేశవనరులను శుష్కింపజేయు జలదారివంటిది నిజ దేశప్రజల మీదనే సైన్యవిహారం శోచనీయమైన విషయం.

ప్రజలను అదుపులో పెట్టడానికి, తరచు పోలీసులను, సైన్యాన్ని ఉపయోగించడంవల్ల వాటిప్రాబల్యం పెరిగి క్రమేణా ప్రజాస్వామిక వ్యవస్థయొక్క పునాదులు కదలిపోవడమేకాకుండా దాని అస్తిత్వానికే ముప్పు వాటిల్లుతుంది ప్రజలు హింసకే అలవాటుపడి ప్రజాస్వామిక వ్యవస్థలో నే నమ్మకాన్ని కోల్పోతారు.

అందుచేత వివాదాలను, సంఘర్షణలను శాంతియుతంగానే పరిష్కరించుకోవటం దేశశ్రేయస్సుకు చాలా ముఖ్యావసరం ప్రజలంతా శాంతియుత పద్ధతులకు అల

పాటుపడేవరకు వారికా పద్ధతులు నేర్పే ఆత్మార్పణపరులైన కార్యకర్తలు కావాలి.

అల్లర్లు లేక పోరాటాలకు రకరకాల కారణాలు సూక్ష్మంగా పరిశీలిస్తే మనకు కనిపిస్తాయి. అందులో రెండు చాలా ప్రముఖంగా కనిపిస్తాయి ఒకటి విభిన్న మతవర్గాలు, భాషావర్గాలు, కులవర్గాలమధ్య చిరకాలంగా పాతుకొని ఉన్న అనుమానాలు, విద్వేషాలు చరిత్రలో చాలా కాలం క్రితం అట్టి అనుమానాలు, విద్వేషాలు పొడచూపడానికి తగిన కారణాలుండేవి. కాని ప్రస్తుతకాలానికి అవి అసంగతమైనవి.

సైప్రసులో గ్రీకులు - తురుష్కులవలె, మధ్య ప్రాచ్యంలో అరబ్బులు - యూదులలాగున రెండుజాతుల మధ్య పరస్పర అనుమానాలు, విద్వేషాలు చెలరేగినప్పుడు వారి శక్తిలో సగభాగం ఇటువంటి అల్లర్లు లేక పోరాటాలలో వ్యయమవుతూ ఉంటుంది దానివల్ల అందరికీ సంబంధించిన సామాజిక, ఆర్థిక పునరుజ్జీవనానికి సమష్టిగా కృషిచేయడానికిగాని, ఆధునిక విజ్ఞానంవలన లభించిన అపారావకాశాలను సదుపయోగపరచి మానవకళ్యాణానికి పాటుపడడానికిగాని వారికి అవకాశమే ఉండదు భారతదేశంలో సంకుచితమైన, పాక్షికమైన విశ్వాసాలవల్ల కలిగిన వివిధ ఘర్షణలకుకూడా ఇది వర్తిస్తుంది.

ఈ పోరాటాలకు సంబంధించిన రెండు ప్రముఖ కారణాలలో రెండవది మరొక విధమైనది. మన దేశపు

సామాజిక, ఆర్థికవ్యవస్థలో చాలా అన్యాయాలు అస్థిగతమై ఉన్నాయి కొంతమందికి వందలాది యెకరాల భూమివుంటే మరికొందరికి ఒక అంగుళంమేరకూడా లేదు. కొంతమంది గుప్పిట వేలాదిమంది ప్రజల ఉద్యోగాలు, బ్రతుకు తెరువుల సాధనాలుంటే కొంతమంది ఉద్యోగమే లేక మలమలమాడుతున్నారు మరికొంతమంది ఇతరుల కంటె ఉన్నతులమనుకొని యితరులను తమతో సమానులుగా ఎంచడానికే యిచ్ఛగించడంలేదు అలాగే ఆర్థిక అవ్యవస్థవలన ఆహారకొరత, ధరల పెరుగుదల మొదలైన సమస్య లుత్పన్న మౌతున్నాయి. ఇవన్నీ చాలామంది ప్రజలను విభిన్న కష్టాలకు లోనుచేస్తున్నాయి.

ఎప్పుడైతే ప్రజలు ఇటువంటి అన్యాయాలను, అసమానతలను సహించలేరో, విభిన్నకష్టాలను భరించలేరో అపుడు వారు వాటిపై తిరగబడతారు అట్టి పరిస్థితులలో శాంతియుతచర్య లేవిధంగా తీసుకోవాలో తరచు వారికి తెలియదు. అలా తీసుకొనే ఓపికకూడా వారికుండదు. దాని వలన హింసాత్మక విప్లవాలు, సంఘర్షణలు బయలుదేరుతాయి

నేడు వీటికి ప్రపంచవ్యాప్తమైన రూపంకూడా ఉన్నది. ప్రపంచంలోని చాల దేశాలలో నేడు అన్యాయమైన ఆర్థిక, సాంఘిక వ్యవస్థలుండడంమూలాన కోట్లాది ప్రజలు దారిద్ర్యంలో ఆకలితో క్రుంగుతున్నారు కాని ఆధునిక విజ్ఞానం మానవకళ్యాణానికి ఎన్నో అవకాశాలను

కల్పించింది. వాటి ప్రయోజనాన్ని మనం యీ బూజు పట్టిన అన్యాయపు వ్యవస్థలో మార్పు సంభవించినప్పుడే పొందగలుగుతాం.

అందుచేత ఈ అన్యాయాలను రూపుమాపాలంటే ప్రపంచవిప్లవం అవసరమని చాలమంది ప్రజలు గట్టిగా భావిస్తున్నారు ప్రపంచయుద్ధానికి దారితీసినాసరే ఆ విప్లవం హింసాత్మకంగానే ఉండాలని వారి విశ్వాసం.

గతంలో హింసాయుత సాంఘిక విప్లవాలు ప్రపంచ యుద్ధాలకు దారితీయకుండానే నడిచాయి. కాని నేటి ప్రపంచ పరిస్థితులలో ఏమూల ఎటువంటి హింసాత్మక సంఘర్షణ చెలరేగినప్పటికీ అది ప్రపంచయుద్ధంగా పరిణమించే ప్రమాదమున్నది మూడవ ప్రపంచయుద్ధమే సంభవిస్తే దానిలో అణుబాంబులు, ఉదజనిబాంబులు ప్రయోగించబడి మానవ నాగరికతే నశించిపోతుంది.

అందువల్ల ప్రజలు యుద్ధాలన్నా, సంఘర్షణలన్నా భయపడుతున్నారు. వారు శాంతికే ప్రాధాన్యం యిస్తున్నారు ఎన్ని బాధలనుభవిస్తున్నా ప్రస్తుతపరిస్థితిని యథాతథంగాఉంచి అయినాసరే శాంతి పరిరక్షణను వారు కాంక్షిస్తున్నారు.

దీనివల్ల ప్రపంచం విప్లవమూ, శాంతియూ అనే ద్వైధీభావంలో పడింది. కాని దానికి రెండూకావాలి శాంతియుతమైన విప్లవం, విప్లవాత్మకమైన శాంతి రెండూ

చాల అవసరం. అది సంభవమేనా? దీనిజవాబుపైనే ప్రపంచ భవిష్యత్తు ఆధారపడిఉంది.

వినోబాజీ 1951 లో విప్లవం చెలరేగిన తెలంగాణా ప్రాంతంలో పర్యటిస్తున్నపుడు దీని జవాబుకొరకే ప్రయత్నించారు భూసమస్యమీద అచట ఒక హింసాత్మక పోరాటం చెలరేగింది. బహుకొద్ది మంది అధీనంలో ఎక్కువభూమి ఉండి చాలమందికి అసలుభూమియేలేని పరిస్థితి ఉండేది అపుడు శ్రీ రామచంద్రారెడ్డిగారు తమంత తామే భూమిలేనివారికొరకై వందయెకరాలభూమిని విరాళంగా యిచ్చినప్పుడు వినోబాజీ భూదానంలో పై ప్రశ్నకొక శాంతియుత పరిష్కారాన్ని కనుగొన్నారు. అప్పటినుండి అన్యాయపు భూవ్యవస్థను సంస్కరించి భారతదేశంలో శాంతిని స్థాపించే మహోన్నత కార్యక్రమంగా భూదానోద్యమం వ్యాప్తిచెందిరింది. తరువాత అది గ్రామదానోద్యమంగా వికసించింది

అందువలన శాంతిసేన నిర్వహించవలసిన ముఖ్యమైన పనులీవిధంగా ఉంటాయి.

1 సంఘర్షణలకు దారితీసే సంకుచితాభిప్రాయాలను తొలగించడం

2. సామాజిక అన్యాయాలను తొలగించి ఆర్థిక వ్యవస్థలో సంపూర్ణంగా మార్పుచేయడం.

3 దేశమంతటా శాంతి పరిస్థితులను నెలకొల్పడం.

4. అవసరమైతే ప్రాణాలర్పించి అయినాసరే హింసాత్మక ప్రజ్వలనములను (Violent owtbursts) శాంతియుత పద్ధతులద్వారా చల్లార్చడం.

5. పైన సూచించిన పనులన్నిటిద్వారా యుద్ధాలను శాశ్వతంగా నివారించి ప్రపంచవ్యాప్తమైన సౌమనస్యసహకారాలకు దారితీసేలాగున భారతదేశమందొక అహింసాయుత సామాజిక వ్యవస్థకు పునాదులు వేయడం.

## పదవ అధ్యాయం

# ఆచరణలో శాంతిసేన

గాంధీజీకి - వారి అనుచరులు కొంతమంది అచ్చటచ్చట కొన్ని స్థానిక శాంతిదళాలేర్పరచినప్పటికీ - వారి 'శాంతిసేన' భావానికి వ్యవస్థాత్మకమైన రూపకల్పన చేయడానికి అవకాశమే లేకపోయింది. అందువల్ల వినోబాజీ తమ కేరళ పర్యటనలో 1957 సంవత్సరం ఆగష్టునెలలో అఖిలభారతస్థాయిలో వ్యవస్థాత్మక శాంతిసేనకు రూపనిర్ధారణచేసి మొదటి శాంతిసైనిక దళాన్ని నెలకొల్పారు.

ప్రస్తుతం భారతదేశం మొత్తంమీద 12,242 మంది శాంతిసైనికులున్నారు 18 సంవత్సరములకు పైబడిన యే వారలైనా యీ దిగువ ప్రతిజ్ఞాపత్రంమీద సంతకంచేసి శాంతిసైనికుడుగా చేరవచ్చును.

1. సత్యాహింసలు ఆధారంగా ఒక నవసమాజస్థాపన జరగాలని
2. సమాజంలో తలయెత్తే వివాదాలన్నిటిని అహింసా పద్ధతులద్వారా పరిష్కరించుకొనవచ్చునని, నేటి యీ అణుయుగంలో ఆవిధంగానే పరిష్కరించుకొనవలసియుండునని
3. సర్వమానవులు మూలతః సమానులని

4. యుద్ధం ఎప్పుడూ మానవవికాసానికి పెద్ద అవరోధమేకాక అహింసాయుత జీవనానికి పూర్తిగా విరుద్ధమని నేను విశ్వసిస్తున్నాను

అందువలన నేను

1. శాంతికొరకై ప్రయత్నించడమేకాక అవసరమైతే దానికొరకు ప్రాణాలను సైతం అర్పించడానికి తయారుగానున్నానని

2 జాతి, మత, వర్ణభేదాలు, రాజకీయ పక్షపాతాలు మానవజాతి మూలైక్యతకే భంగకరంకాబట్టి వాటి నన్నిటిని అధిగమిస్తానని

3 ఎట్టి యుద్ధాలలోను నేను పాల్గొనని

4. అహింసాత్మకరక్షణకు కావలసిన సామగ్రిని పెంపొందించడానికి, అవసరమైన వాతావరణాన్ని సృష్టించడానికిపూర్తిగా తోడ్పడతానని

5. రోజూ నియమపూర్వకంగా నా సమయంలో కొంత భాగాన్ని సాటిమానవసేవకు వినియోగిస్తానని

6 శాంతిసేన క్రమశిక్షణను పూర్తిగా ఆమోదించి పాటిస్తానని ఇందుమూలంగా ప్రతిజ్ఞచేస్తున్నాను.

[శాంతిసేనలో చేరినమీదట ప్రతిశాంతిసైనికుడు ఒక శాంతి కేంద్రానికి నియోగించబడతాడు. అతడు

మధ్యలో రాజీనామా చేయడంగాని, అతని ప్రవర్తనకు సంబంధించిన అననుకూలమైన రిపోర్టు లేమైన రావడంగాని జరిగితేతప్ప ఒక సంవత్సరం ప్రొబేషన్ లేక అర్హతా పరీక్షణ తర్వాత అతడు సంపూర్ణ శాంతిసైనికుడుగా పరిగణించబడతాడు

## శాంతి కేంద్రాలు

ఒకదానికొకటి చేరియున్న క్షేత్రాలలో నివసిస్తున్న యిద్దరు, అంతకంటె ఎక్కువ శాంతిసైనికులు కలిసి శాంతి కేంద్రాన్ని ఏర్పాటుచేసుకోవచ్చును. శాంతిసేన కది ప్రధానమైన నెలవు

ఒక కేంద్రంలోని శాంతిసైనికులు గత వారంలో జరిగిన పనిని సమీక్షించుకొనడానికి, ముందు వారపు కార్యక్రమాన్ని రూపొందించుకొనడానికి కనీసం వారానికొకసారియైనా కలుసుకొంటూ ఉంటారు శాంతికి భంగకరంగా స్థానికంగా పొడసూపే ఎట్టి సూచన (tendency) నైనా అరికట్టడానికి ప్రయత్నించడం క్రమబద్ధమైన సమాజసేవ, నియమపూర్వకమైన పఠనం, పారనం, వ్యాయామం, ఆటలు మొదలైనవి వారి సాధారణ కార్యక్రమంలోని కొన్ని అంశాలు.

స్థానిక పరిస్థితులననుసరించి వారి వాస్తవిక కార్యక్రమం మార్పుచెందుతూ ఉంటుంది కాని స్థూలంగా దానిని మూడు వర్గాలు ( Categories )గా విభజించవచ్చును.

1. సేవ, 2 చదువు, 3. శరీరపరిశ్రమ.

ఒక జిల్లాలో తగినన్ని శాంతి కేంద్రాలుంటే వాటి పనులను సమన్వయపరచడానికి ఒక జిల్లా సంయోజకుడుగాని జిల్లా శాంతి సేన సమితిగాని ఉండాలి. దీనిని రాష్ట్రశాంతి సేన సమితి ఏర్పాటుచేస్తుంది. రాష్ట్రశాంతి సేన సమితిని అఖిలభారత శాంతిసేన మండలి అధ్యక్షుని అంగీకారంతో రాష్ట్రసర్వోదయమండలి ఏర్పాటుచేస్తుంది. రాష్ట్ర శాంతి సేన సమితి చేసేపనులు—రాష్ట్రవ్యాప్తంగా శాంతి సేన కార్యక్రమాన్ని ఏర్పాటుచేయడం, రాష్ట్రంలో ఏమూలనైనా అలజడి బయలుదేరితే అచటికి శాంతిసైనికులను పంపడం

అఖిలభారత శాంతి సేనమండలిని సర్వసేనా సంఘాధ్యక్షుడు ఏర్పాటుచేస్తాడు అది దేశవ్యాప్తంగా శాంతి సేన కార్యక్రమాలను పెంపొందించి సమన్వయపరుస్తుంది. ఆ మండలి మూడుసంవత్సరాలు అధికారంలో ఉంటుంది. శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారు ప్రస్తుతం ఆ మండలికి అధ్యక్షులు శ్రీ వినోబాజీ అఖిలభారత శాంతిసేనకు సర్వసేనాధిపతి (Supreme commander) అనగా దేశంమొత్తంలోని శాంతిసైనికులకు ఆజ్ఞలిచ్చే సంపూర్ణాధికారం వారికున్నది శాంతిసేనకూ వ్యవస్థాత్మక నిర్మాణానికి సంబంధించి వారికెట్టి నియమబద్ధమైన సంబంధం (Constitutional relation ship) లేకపోయినా మండలి తీసు

కొనే నిర్ణయాలన్నీ వారి సలహా సంప్రతింపులతోనే జరుగుతాయి

శాంతిసేన ప్రయోజనకరంగా ఉంటుందా ? తరచు ఉదయిస్తూ ఉండే ప్రశ్న యిది గత తొమ్మిది సంవత్సరాల అనుభవం శాంతిసేన స్థాపనకు పురికొల్పిన విశ్వాసాన్ని బలపరచింది ప్రస్తుతం శాంతిసేన కావలసిన దానికంటె చాల చిన్నదిగానే ఉన్నది. ప్రతి 5 వేల జనాభాకు ఒక శాంతి సైనికుని చొప్పున ఉండాలని వినోబాజీ ఆశించారు. ఆ లెక్క ప్రకారం దేశం మొత్తంమీద 90 వేల శాంతిసైనికులుండాలి కాని ప్రస్తుతం 12 వేలు మాత్రమే ఉన్నారు. అందులో సగభాగం బీహారులోనే ఉన్నారు అయినప్పటికీ యీ చిన్ని బలగం సాధించిన విజయంచూస్తే చాల ఉత్సాహం కలుగుతుంది.

ప్రదర్శనలు, తగాదాల సమయాలలో అది హింసాయుతమైన అల్లర్లను చాలవరకు అరికట్టకలుగుతున్నది ఉదాహరణకు గుజరాత్‌లో ప్రత్యేక రాష్ట్రానికి ఆందోళన జరుగుతున్నప్పుడు బరోడాలోని శాంతిసేన రాష్ట్రంలో శాంతిని కాపాడడంలో ఊరేగింపులుచేసి, నాయకులను కలుసుకొని, కరపత్రాలు పంచిపెట్టి విశేషమైన కృషి చేసింది. కొన్ని సందర్భాలలో ప్రజాసమూహాలకు, పోలీసులకు మధ్యనిలిచి హింసాయుత సంఘర్షణాలు జరుగకుండా నివారించింది ప్రదర్శకులను అమానుషంగా కొట్టి హింసించకుండా పోలీసువారిని ఆపగలిగింది. పోలీసువారు వారి

సేవను మెచ్చుకొని తాము అహమ్మదాబాదు తరలివెళ్తున్న
పుడు వారిని మరికొంతకాలంపాటు అచట ఉండవలసిన
దిగా ప్రార్థించారు.

ఇందోరులో మిల్లు యజమానులు, కార్మికులమధ్య జరిగిన వివాదంలో హింసాయుతచర్యలేమీ జరుగకుండా కనీసం మూడుసార్లు అయినా శాంతిసేన సహాయపడింది.

1961 వ సంవత్సరంలో ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమ భాగంలో వర్గకలహాలు (Communal riots) చెలరేగినపుడు ఆగ్రాలోని శాంతిసైనికులు తగు జాగ్రత్త వహించి అచట శాంతి నెలకొని ఉండేలాగున చూడడంలో ప్రముఖపాత్ర వహించారు. 1964 వ సంవత్సరంలో బీహారు, ఒరిస్సాలలో తీవ్రమైన వర్గకలహాలు చెలరేగినపుడు వాటితాకిడి ఖరగ్‌పూరుకుకూడా తగిలింది. కాని స్థానిక శాంతిసైనికుల జాగ్రత్తవల్ల అచట అవాంఛనీయమైన సంఘటనలేమీ జరగలేదు.

జయప్రదంగా తగాదాలు పరిష్కరించడానికి ఉపవాసాలు చేసిన సందర్భాలుకూడ ఉన్నాయి మాన్యులైన కేరళనాయకులు శ్రీ కేలప్పన్‌గారు కేవులకు (boat fares) సంబంధించిన వివాదాన్ని స్నేహయుతంగా పరిష్కరించడంలో ఆ అస్త్రాన్ని ఉపయోగించారు అచ్చట కేవులు పెంచడంతో విద్యార్థుల వ్యతిరేక ప్రదర్శనలు, హింసాకాండ చెలరేగాయి ఒరిస్సాలో విద్యార్థులు, ప్రభుత్వం మధ్య చెలరేగుచుండిన వివాదం ఆచార్య హరిహరదాసు

గారు నిరశనవ్రతం చేస్తాననడంతో జయప్రదంగా పరి ష్కారమయింది. మద్రాసులో జరిగిన హిందీవ్యతిరేకోద్యమాన్ని శాంతింపజేయడానికి వినోబాజీ కావించిన ఉపవాస వ్రతం అందరికీ బాగా తెలిసినదే.

హింసాయుతమైన అల్లర్లు విస్తృతంగా చెలరేగి నప్పుడు శాంతిసైనికులు సాధారణంగా ప్రజలను శాంత పరచి హింసను అరికట్టడానికి ప్రయత్నించారు. స్థానికంగా ఉండే బహుకొద్దిమంది శాంతిసైనికులు వారు చేయగలిగిన దంతా చేశారు. వార్త అందగానే ఎక్కువ సంఖ్యలో శాంతిసైనికులు పంపబడ్డారు. వారు ప్రజలను శాంతపరచ డంలోను, వారి మనస్సులలోని అనుమానాలను పోగొట్ట డంలోను, పదభ్రష్టులను పునరుద్ధరించడంలోను ప్రతిభా వంతంగాను, శ్లాఘనీయంగాను పనిచేశారు. అస్సాంలో బెంగాలీ వ్యతిరేకోద్యమ సందర్భంగా అల్లర్లు చెలరేగి నపుడు భారతదేశం నలుమూలలనుండి శాంతిసైనికులు అస్సాం వెళ్లారు. తరువాత పండిత జవహర్‌లాల్ నెహ్రూ గారి ప్రార్థనపై వినోబాజీయే స్వయంగా అస్సాం వెళ్ళి శాంతిసేనా కార్యక్రమాన్ని జయప్రదంగా నడిపించారు.

సింగ్‌భూం, రాంచి, సుందర్‌ఘర్ జిల్లాలలో చెల రేగిన వర్గకలహాల సందర్భంలో బీహారు, ఒరిస్సాలనుండి పెద్ద సంఖ్యలో శాంతిసైనికులు కలహగ్రస్త ప్రాంతాలకు వెళ్ళి అల్లరలో పాల్గొన్నవారిని వారికృత్యాలకు పశ్చా త్తాపపడేలాగున చేయడంలోను, వారు తగులబెట్టిన

యిండ్లను పునర్నిర్మించడంలో పూర్తిగా సహాకరించే లాగున చేయడంలోను కృతకృత్యులయ్యారు.

బీహార్‌లోని సీతామర్హిలో వర్గకలహం చెలరేగి ముఖ్యంగా నిమ్నజాతుల వారియిండ్లు తగులబెట్టబడినపుడు శాంతిసైనికులు దానిని విస్తృతం కాకుండా ఆపగలిగారు అలాగే ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమభాగంలో వర్గకలహాలు చెలరేగినపుడు, మద్రాసులో హిందీవ్యతిరేకోద్యమం నడచినపుడు, పంజాబీసుబా వ్యతిరేకోద్యమ సమయంలోను శాంతిసైనికులు ప్రశంసనీయమైన కృషిచేశారు

అనుభవంవల్ల తేలిన విషయమేమంటే ఎచటనైనా హింసాకాండ చెలరేగి దాని తాకిడిని తట్టుకొనడానికి బయటనుండి సమయానికి శాంతిసైనికులు రావడాని కవకాశం లేనపుడు స్థానిక శాంతిసైనికులే వారు ఎక్కువ సంఖ్యలో ఉన్నపక్షంలో అహింసాకాండను జయప్రదంగా అరికట్టగలుగుతారు అందువల్ల వినోబాజీ ఊహించినట్లుగా ప్రతి 5 వేల జనాభాకు కనీసం ఒక శాంతిసైనికుని-చొప్పున విస్తృతమైన శాంతిసేన ఉంటే అది శక్తివంతమైన శాంతి పరిరక్షణ బలంగా ఉపయోగపడగలదని స్పష్టమవుతోంది.

ప్రజలలో బలహీనులను పలురకాలైన అక్రమాలు, నిర్బంధాలనుండి రక్షించడంలోకూడ శాంతిసేన కార్యక్రమం ఫలవంతమైనది బీహారులోని పూర్ణియాలోను, ఒరిస్సాలోని కోరాపుట్‌లోను వారు లంచగొండితనాన్ని, అవినీతిని జయప్రదంగా అరికట్టగలిగారు. కోరాపుట్‌లో

వారు భీరువులైన ఆదిమవాసులలో ధైర్యాన్ని నెలకొల్పడంలోకూడ కృతకృత్యులు కాగలిగారు

ఖడక్ వాస్లా డాం పడిపోయినప్పుడు పూనాలో సంభవించిన వరదలు, ఆంధ్రప్రదేశ్‌లోని తుఫాన్ భీభత్సం, బీహారువరదలు మొదలైన ప్రకృతి జన్యవిపత్సమయాలలో కూడా శాంతి సేన చాల సహాయపడింది

## శాంతి సేవాదళం

శాంతి సైనికునికన్న కొంచెం సరళమైన ప్రతిజ్ఞ తీసుకొని పనిచేసే స్వచ్ఛంద సేవకుల కూటమి శాంతి సేవాదళం. అది శాంతి సేనయొక్క ఒక భాగమే శాంతి సైనికులవలె కఠిన నియమవ్రతులు కావడానికి సిద్ధంగా లేకపోయినా శాంతి నాకాంక్షిస్తూ దానికి చేతనైన కృషి చేయదలచే వారిలో అత్యధికభాగాన్ని యీ శాంతి కార్యక్రమంలో పాల్గొనేటట్లు చేయడమే శాంతి సేవాదళం యొక్క ముఖ్యోద్దేశం.

దీనికి రెండు శాఖలుంటాయి 1 కిశోర్ శాంతిదళం ఇందులో పన్నెండునుండి పద్దెనిమిది సంవత్సరాలలోపు వయస్సుకలిగిన యువకులుంటారు. 2. తరుణశాంతిదళం ఇందులో 18 నుండి 30 సంవత్సరాలలోపు వయస్సుకలిగిన స్త్రీ పురుషులుంటారు

ఈ రోజులలో బాలురు, యువకులు ప్రముఖపాత్ర వహించని ఉద్యమాలు లేనేలేవని చెప్పవచ్చు. ఈ కిశోర్

శాంతిదళం యువకులలో వాస్తవికమైన సామాజిక దృక్ప థాన్ని తీసుకొనివచ్చి వారిశక్తిని నిర్మాణాత్మకమైన, ఫల ప్రదమైన కార్యాలలోనికి మళ్ళిస్తుంది. 1964 వ సంవత్సరం నుండి కిశోర్ శాంతిసేవాదళాల అఖిలభారత వార్షిక శిబి రాలు నడుస్తున్నాయి అవి చాలా ఉత్సాహకరమైన సత్ప లితాల నిస్తున్నాయి ఈ శిబిరాలకు హాజరైన వేలాది యువతీ యువకులు తమతమ స్థానాలలో శాంతిసేవాదళ యూనిట్లను స్థాపించి చాల ఉపయోగకరమైన పనులు చేస్తున్నారు.

తరుణశాంతిదళం సమాజసేవకు, నిర్మాణ కార్య క్రమాలకు సువ్యవస్థితమైన సమర్థవంతమైన స్వచ్ఛందసేవక బృందాన్ని సమకూరుస్తుంది.

శాంతిసేన తన విభిన్న భాగాలతో పట్టణప్రాంతాల లోను, పల్లెసీమలలోనుకూడా పనిచేస్తుంది. పట్టణాలలో శాంతిసేన సర్వోదయోద్యమంయొక్క ఏకైక లేక ప్రముఖ కార్యవిభాగం. చాలవరకు ఉద్రేకాలు, తగాదాలు, అల్లర్లు సాధారణంగా మొదట పట్టణ ప్రాంతాలలోనే బయలుదేర తాయి అందుచేత వాటిని అవి బయలుదేరేచోటనే అరి కట్టడం చాలా ముఖ్యమైన విషయం

త్రివిధకార్యక్రమంయొక్క అభిన్న అంగంగా శాంతిసేనకు గ్రామసీమలతో ఎక్కువ సంబంధం ఉంది గ్రామదాన సిద్ధాంత ప్రచారం శాంతిసేనయొక్క సర్వ ప్రముఖమైనకార్యం. ఎందుచేతనంటే మొత్తందేశాన్ని

కబళించివేసే మహాప్రమాదకరమైన పోరాటాలమూలాన్ని రూపుమాపటానికి గ్రామదానం పరిశ్రమిస్తుంది. గ్రామదానంలోనికి గ్రామాలువచ్చిచేరిన కొలదివాటిలో చేయవలసిన సర్వప్రముఖకార్యంకూడా అదే.

గ్రామదాన గ్రామాలలోకూడా ఉద్రేకాలు, తగాదాలు రావచ్చును. అవి గ్రామానికి, గ్రామానికి మధ్యగల వైషమ్యాలు, వివాదాలుకావచ్చును వ్యాజ్యాలు పల్లె ప్రాంతాలకు వేరుపురుగులవంటివి. ఆస్తి పాస్తులన్నీ వాటిలో వ్యయమైపోయి గ్రామశాంతి ఛిన్నాభిన్నమైపోతుంది. సమాజవ్యతిరేక ప్రవర్తనలు, నేరాలు మొదలైన సమస్యలుకూడా గ్రామాలలో ఉత్పన్నమవుతాయి. గ్రామసీమలలోని యీ సమస్యలన్నిటిని శాంతిసైనికులు, శాంతిసేవకులు ఎదుర్కొనవలసి ఉంటుంది

## యూనిఫారములు

శాంతిసైనికులు డ్యూటీలోనున్నపుడు తెల్లని ఖద్దరు వస్త్రాలు ధరించి తలకు 24 అంగుళాల చదరంకలిగి త్రికోణాకారంగా మడచబడిన కుంకుమపువ్వురంగు ఖద్దరు రుమాలు కట్టుకొనవలసి ఉంటుంది.

శాంతిసేవకులు తెల్లఖద్దలు నిక్కరు, పొట్టిచేతుల చొక్కాధరించి శాంతిసైనికులు తలకు ధరించే రుమ్మాలు వంటి రుమాలును స్కార్ఫ్‌వలె మెడచుట్టు ధరించాలి. అంతేకాక వారు నడుముచుట్టు కుంకుమపువ్వురంగు బెల్టుకూడా

ధరించవలసి ఉంటుంది. ఎడమఛాతీపై ధరించడానికి ఒక లోహపు బాడ్జికూడా వారికి ఇవ్వబడుతుంది

## సర్వోదయపాత్ర

శాంతిసేన కార్యక్రమాలలో సర్వోదయపాత్ర ఒక ముఖ్యాంగం. ఈకార్యక్రమాన్ని సమర్థించే ప్రతి గృహస్థూ రోజూ ఒక గుప్పెడు ఆహారధాన్యాలను ఈ ఉద్యమానికి సహాయార్థంగాను, దీనిపట్ల తనకుగల అభిమానానికి చిహ్నంగాను ఒక పాత్రలోవేస్తూ ఉండాలి ఈ పని కుటుం బంలోని చిన్నపిల్లలందరిచేత చేయించాలని వినోబాజీ ఆశయం. రోజూ నియమపూర్వకంగా ఈ పనిచేస్తూ ఉండడంవల్ల పిల్లలలో వారి పిన్నవయస్సునుండికూడా సామాజిక దృక్పథం, సేవాభావం, వితరణగుణం వెలువడి పెద్దవారైన తరువాత వారు ఆదర్శభారత పౌరులు కాగ లుగుతారు

ప్రస్తుతం ఈ సర్వోదయపాత్ర కార్యక్రమం ఆంధ్ర ప్రదేశ్, మదరాసు రాష్ట్రాలలోని ముఖ్యపట్టణాలలోను రాజధానులలోను చాల ఫలప్రదంగాను, సువ్యవస్థితంగాను నడుస్తూఉన్నది.

## ఇతర కార్యక్రమాలు

1962 లోని భారత – చైనా పోరాటసమయంలో సర్వసేవాసంఘం ఆనాటి పరిస్థితిని సమీక్షిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఇతర అంశాలతోపాటు ఆ

తీర్మానంలో "సరిహద్దు ప్రాంతాలలోని ప్రజలలో అహింసాయుత ప్రతిఘటనశక్తిని పెంపొందించడం మన ముఖ్య కర్తవ్యాలలో ఒకటి. అవకాశముడున్న చోటల్లా శాంతిసైనికులు ప్రజలను గ్రామ స్వయంసమృద్ధిలో ఆసక్తులనుగాచేసి దురాక్రమణను ( aggression ) సహాయనిరాకరణంద్వారా ఎదుర్కొనేలా ప్రేరేపించాలి. అందు కొరకు వారు అవసరమైతే తమ ప్రాణాలను సైతం త్యాజించడానికి సిద్ధంగా ఉండాలి. ప్రజలనుకూడ అందుకు ఆయత్తపరచాలి". అని ఉన్నది

ఇంతేకాక సర్వసేవాసంఘం దేశంలోని అహింసలో నమ్మకమున్న సంస్థల నన్నిటిని జాతీయసమైక్యతను, అహింసాయుత ప్రతిఘటనశక్తిని పెంపొందించే ద్విముఖ కార్యక్రమంలో సహకరించవలసినదిగా ఆహ్వానించింది

ఈ ఆహ్వానాన్ని పురస్కరించుకొని అట్టి ముఖ్య సంస్థలతో కూడిన ఒక సమన్వయసమితి (కో ఆర్డినేషన్ కమిటీ) ఏర్పాటైంది ఈ సమితి ఆధ్వర్యంలో ఇపుడు సరిహద్దు ప్రాంతాలలో 123 కేంద్రాలు పనిచేస్తున్నాయి. వీటిలో 38 కేంద్రాలు అస్సాంలోను, 7 కేంద్రాలు నేఫాలోను, 2 కేంద్రాలు నాగాలాండ్‌లోను, 34 కేంద్రాలు ఉత్తరఖండంలోను, 1 కేంద్రం హిమాచల్ ప్రదేశ్‌లోను, 2 కేంద్రాలు ఉత్తర పంజాబ్‌లోను, 39 కేంద్రాలు పూర్ణియాలోను, 3 కేంద్రాలు పశ్చిమబెంగాలులోను పని చేస్తున్నాయి పాకిస్తాన్ సరిహద్దులలోకూడ ఇటువంటి

కార్యక్రమాన్ని ప్రారంభించాలని యిటీవలనే నిర్ణయించ బడింది ఈ కార్యక్రమంలో శాంతిసేన పాల్గొంటున్నది.

ఈ సరిహద్దు కార్యక్రమంలోని ముఖ్యాంశాలు—

1. సరిహద్దు ప్రజలమధ్య, దేశంలోని యితర ప్రజల మధ్య భావసమైక్యతను (emotional integration) సాధించడం
2. సరిహద్దు ప్రజల నైతిక, భౌతిక ఉన్నతికితోడ్పడడం
3. వారిలో దురాక్రమణను అహింసాయుత ప్రతిఘటన ద్వారా ఎదుర్కొనే శక్తిని మేల్కొల్పడం
4. సరిహద్దులలోని విభిన్న ప్రాంతాలలో పరస్పర స్నేహసౌహార్ద్రాలు నెలకొల్పడం ఈ కేంద్రాలలో ఇంతవరకు సాధించబడిన ఫలితాలు చాల ప్రోత్సాహకరంగానే ఉన్నాయి నేఫాలోని కేంద్రాలు శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూ గారి సూచన ననుసరించి ప్రారంభించబడినవనిన్నీ ఆ ప్రాంతాలలో ఈవిధంగా ఏర్పాటు చేయబడిన సేవా కేంద్రాలన్నిటిలో ఇవే మొదటివనిన్నీ యీ సందర్భంలో మనం గుర్తుంచుకోవాలి అంతవరకు ఆ ప్రాంతాలను భారతదేశంలోని యితర ప్రాంతాలతో సంబంధంలేకుండా [illegible] పద్ధతి ననుసరించ బడింది.

## ఢిల్లీ - పెకింగ్ స్నేహయాత్ర

ఈ యాత్ర 1963 వ సంవత్సరం మార్చినెలలో భారత - చైనాదేశాలమధ్య మైత్రీభావాన్ని నెలకొల్పే ఉద్దేశంతో ప్రారంభించబడింది. భారతీయశాంతి సేన విశ్వ శాంతి సంఘాన్ని (world peace Brigade) ఈ ప్రణాళికను నిర్వహించవలసిందిగా కోరినమీదట విశ్వశాంతి సంఘం ఈ యాత్రను ఏర్పాటుచేసింది

చైనా ప్రభుత్వం ఈ యాత్రికులకు సరిహద్దులు దాటి రావడానికి అనుమతిని నిరాకరించడంతో ఈ యాత్ర ఉద్దేశం నెరవేరనిమాట నిజమే. కాని భారత ప్రభుత్వం మాత్రం ఒక అంతర్జాతీయ బృందానికి సరి హద్దులు దాటి వెళ్ళడానికి అనుమతినిచ్చి తన విశాల దృక్పథాన్ని ప్రదర్శించింది. దేశంలో యుద్ధోన్మాదం తగ్గడానికి ఈ యాత్ర కొంతవరకు ఉపయోగపడింది.

## నాగాలాండ్ శాంతిసంఘం

శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారీ నాగాలాండ్ శాంతిసంఘంలో సభ్యులైనప్పటికీ శాంతిసేనా మండలికి దానితో ప్రత్యక్ష సంబంధం ఏమీలేదు. అయినా చాల కాలంనుండి శాంతిసేనామండలికి నాగా సమస్యలో ఆసక్తి, శ్రద్ధ ఉండి కొహిమాలో ఒక శాంతికేంద్రం ఏర్పాటైంది కూడా.

నాగాలాండ్ భారతదేశంలోని అంతర్భాగమనీ, కాని దెబ్బలాట సమయంలో నాగాప్రజలమీద జరుపబడిన అత్యాచారాలు వారిని క్రోధోన్మత్తులనుగా చేశాయనీ శాంతిసేనామండలి భావిస్తున్నది. చాల సంవత్సరాల తర్వాత మొట్టమొదటిసారిగా ఈ శాంతిసంఘు కృషి ఫలితంగా నాగాలాండ్‌లో శాంతిఏర్పడింది. ఇది ఆ ప్రజలకు వరప్రసాదమై నాగాలాండ్ సమస్య శాంతియుతంగా పరిష్కారం కావడానికి అవకాశా లేర్పడ్డాయి.

## పదకొండవ అధ్యాయం

# ఉపసంహారం

వెనుకటి అధ్యాయాలలో త్రివిధ కార్యక్రమంలోని గ్రామదానం, ఖాదీ, శాంతిసేనల వివిధ రూపాలనుగూర్చి వేరువేరుగా చర్చించాం వినోబాజీ చెప్పినట్లు యివి మూడు విభిన్న కార్యక్రమాలకూడలి కాక త్రిమూర్తి విగ్రహం యొక్క మూడుముఖాలవలె ఒకే అభిన్నకార్యక్రమం యొక్క మూడు రూపాలు. మొత్తం ఆ విగ్రహాన్ని ఒకే రూపంగా పూజించాలిగాని మూడు వేర్వేరు ముఖాలుగా కాదు.

భారతదేశం, ఒక భారతదేశమేకాదు, మొత్తం మానవప్రపంచమే నేడు మూడురోగాలతో పీడించబడు తున్నది -ధనికరాజ్యం (Capitalism), ఉద్యోగులరాజ్యం (Bureaucratism), సైనికరాజ్యం (Militarism), ఈ మూడు రోగాలను మటుమాయంచేసే మందు ఈకార్యక్రమత్రయం. గ్రామదానం వికేంద్రీకృత పరిపాలనా ప్రణాళికలకు పునాదివేసి ఉద్యోగరాజ్యాన్ని అరికట్టడానికి ప్రయత్ని స్తుంది. ఖద్దరు, గ్రామీణపరిశ్రమలు ధనికరాజ్యాన్ని రూపుమాపుతాయి. శాంతిసేన పోలీసుల అవసరంలేకుండా చేస్తుంది.

పై మూడురోగాలు మూడు విడివిడిరోగాలుగా కని పించినప్పటికి నిజానికి అవి ఒకేమూల రోగంయొక్క విభిన్న లక్షణాలు. అలాగే వాటిని కుదిర్చే మూడు ఔషధాలుకూడ ఒకే ప్రయోజనకరమైన ఆయుధంయొక్క మూడు మొనలు.

ప్రస్తుతం పిలుపు తుఫాను గ్రామదానోద్యమానికి ఉన్నది. చాలపెద్ద సంఖ్యలో గ్రామదానాలు పొందడానికి వేలాది కార్యకర్తలు పనిచేస్తున్నారు. దీనివలన మిగిలిన రెండురూపాలు విస్మరించబడినట్లుగా కనిపిస్తున్నది. కాని వాస్తవం అదికాదు.

వినోబాజీ పోల్చినట్లుగా గ్రామదానం అనే పునాది మీద ఖద్దరు, శాంతిసేన అనే పైకట్టడాలనుకట్టి గ్రామ స్వరాజ్యం అనే భవనాన్ని పూర్తిచేయాలి. అందుకు అన్నిటికంటె ముందుగా గ్రామదానపు పునాదిరాయి వేయాలి. పునాదిలేకుండా పైకట్టడాలు నిలువవుగదా! అందువల్ల గ్రామదానంమీద మొదట దృష్టి కేంద్రీకరించ బడుతున్నది దానివలన మిగిలినవి విస్మరించబడుతున్నా యని అనుకోనడం పొరపాటు ఖద్దరు, గ్రామపరిశ్రమలు, శాంతిసేనల ఏర్పాటులేకుండా గ్రామదానలక్ష్యం ఎన్న టికీ సిద్ధించదు.

అనుభవంలో తేలే విషయం ఏమంటే నిజానికి గ్రామ సంఘాలు (Village communities) లేక గ్రామప్రజలు చేపట్ట నిదే ఖద్దరు, గ్రామపరిశ్రమలు అభివృద్ధిచెందలేవు. నేడు

భారతావనిలో ఖద్దరు కార్యక్రమాలో లేక యితర గ్రామ పరిశ్రమలో నడుస్తున్న గ్రామాలు ఒక లక్షదాకా ఉన్నాయి. కాని కొన్ని గ్రామాలలోమాత్రమే అవి గ్రామ సంపదకు మూలకందాలుగా ఉన్నాయి గ్రామదాన తత్త్వంమాత్రమే వాటిని వాటి చరమలక్ష్యానికి జయప్రదంగా చేర్చగలుగుతుంది. అందువల్ల ఖద్దరు, గ్రామపరిశ్రమలు నెలకొన్న గ్రామాలలో గ్రామదానాలు సాధించడానికి యత్నించాలి

గ్రామదానం దేశంలో అన్నిటికంటె మిక్కిలి బగ్గునమండెడు (Explosive) సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నిస్తుంది అందుచేత గ్రామదాన సందేశాన్ని నలుమూలలా తీసుకొనివెళ్ళేపనిలో నిమగ్నులైన వేలాది కార్యకర్తలు, గ్రామీణులు వాళ్ళు లాంఛనయుతమైన శాంతిసైనికులుగా చేరినా, చేరకపోయినా నిజానికి శాంతిసైనికుల పనిసే చేస్తున్నారు. ఒక గ్రామంకాని, ఒక ప్రాంతం కాని ఒకసారి గ్రామదానంగా వచ్చినదీ అంటే ప్రజా సహకారంతో పెద్దపెట్టున అక్కడ శాంతిసేనను ఏర్పాటు చేయడం సులభవవుతుంది.

గ్రామదాన ఆదర్శాన్ని వాటితప్పకుండానూ అనైక్యత సంకుచితత్వం, స్వార్థపరత్వం మొదలైన వినాశకరశక్తుల బారిపడకుండాను, సదారక్షిస్తూ దీనిని చెక్కుచెదరకుండా కాపాడాలి గ్రామదానాలను ఎప్పుడూ అభివృద్ధి నిరోధక శక్తులనుండి రక్షిస్తూ వాటి ఆదర్శాలను

ఉజ్జ్వలంగా వెలుగొందజేసే అహింసాయుత శక్తులే శాంతి సేన, శాంతి సేవాదళాలు

ఈవిధంగా గ్రామదానోద్యమంయొక్క మూడు రూపాలు ఒకదానికొకటి సన్నిహితంగాను, అభిన్నంగాను ముడివడిఉన్నాయి వాటిలోనే మిగిలిన నిర్మాణాత్మక కార్యాలన్నీ ఇమిడి ఉన్నాయి.

శ్రీజయప్రకాశ్ నారాయణ్‌గారు చెప్పినట్లు గ్రామ స్వరాజ్యం జోడెద్దులబండి అయితే దానికి చలనశక్తిని యిచ్చే ఎద్దులే గ్రామదానం దాని చక్రాలు శాంతిసేన, ఖద్దరు కార్యక్రమాలు మిగిలిన నిర్మాణాత్మక కార్య క్రమాలన్నీ దానిమీద వేసే పరుకు లేక బరువు. ఎద్దులు లేక పోతే బండి కదలలేదు అలాగే గ్రామస్వరాజ్యంకూడాను. అందుకనే వినోబాజీ గ్రామదానంద్వారా దానికి చలన శక్తిని కలుగజేయవలసిన అవసరాన్నిగూర్చి నొక్కి వక్కాణిస్తున్నారు

మన ప్రస్తుత ఆర్థికపరిస్థితి, అంతర్విభేదాలు దేశంలో అరాజకస్థితిని సృష్టించేలా ఉన్నాయి. అందుకనే వినో బాజీ గ్రామదానం ఒక్కటే దేశాన్ని రక్తపాతంతోకూడిన విప్లవంనుండి రక్షించగలుగుతుందని హెచ్చరిస్తున్నారు ఈ అత్యవసర పరిస్థితిని వెంటనే క్రియాత్మకంగా గుర్తిం చడం వారిని, వారినేకాదు, దేశశ్రేయస్సును, విశ్వశ్రే యస్సును ఆకాంక్షించే ప్రతివారిని ఉత్సాహపరచి ఉత్తేజ పరుస్తుంది.

## అనుబంధం - 1

# భూదానపు రాబడి, పంపకాలు

## (1966 సం॥ మార్చివరకు)

| రాష్ట్రం | జిల్లాల సంఖ్య | సంపాదించబడిన భూమి (ఎకరాలలో) | ఇంతవరకు పంచబడిన భూమి (ఎకరాలలో) | సేద్యానికి తగనిదిగా వదలబడిన భూమి (ఎకరాలలో) | ఇంకా పంపకానికి ఉన్న భూమి (ఎకరాలలో) |
|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 20 | 2,42,952 | 1,03,308 | 86,385 | 53,259 |
| అస్సాం | 19 | 11,935 | 265 | — | 11,670 |
| ఒరిస్సా | 13 | 1,73,872 | 1,03,416 | 15,222 | 55,234 |
| ఉత్తరప్రదేశ్ | 54 | 4,34,351 | 1,84,274 | 1,37,127 | 1,12,950 |
| కేరళ | 9 | 26,293 | 5,774 | 7,999 | 12,520 |
| ఢిల్లీ | 1 | 300 | 180 | 120 | — |
| పంజాబ్ | 18 | 14,739 | 3,601 | 3,380 | 7,758 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుజరాత్ | 18 | 1,03,242 | 52,080 | 27,994 | 23,168 |
| మహారాష్ట్ర | 25 | 1,50,802 | 1 07,111 | 38,343 | 5,348 |
| మధ్యప్రదేశ్ | 43 | 4,05,402 | 1,57,506 | 1,74,531 | 74,365 |
| మైసూరు | 19 | 20,086 | 3,181 | 53 | 16,852 |
| (పశ్చిమ) బెంగాల్ | 17 | 12,918 | 3,856 | 8,426 | 636 |
| బీహార్ | 17 | 21,32,787 | 3,11,037 | 10,79,701 | 7,42,049 |
| రాజస్థాన్ | 26 | 4,29,428 | 92,734 | 1,11,757 | 2,24,937 |
| హిమాచల ప్రదేశ్ | 6 | 5,240 | 2,531 | — | 2,709 |
| జమ్మూ కాశ్మీర్ | 15 | 211 | 5 | — | 206 |
| మొత్తం | 333 | 42,44,991 | 11,51,378 | 16,91,041 | 14,02,572 |

## అనుబంధం 2

# తాలూకాదానాలు

## (1966 అక్టోబర్ 25 వ తేదీవరకు)

| రాష్ట్రం | జిల్లాలు | తాలూకాల పేర్లు |
|---|---|---|
| మద్రాస్ | 1. మదురై | మేలూర్ (Melur) |
| | 2 తిరునల్వేలి | నంగనేరి (Nangunerı) |
| మహారాష్ట్ర | ఠాణా | 1. తాల్‌సారి (Talasarı) |
| | | 2. మొఖాడా (Mokhada) |

# రాష్ట్రాలవారీగా గ్రామదానాలు

## (1966 సెప్టెంబర్ 30 వ తేదీవరకు)

| రాష్ట్రం | తుఫాన్ గ్రామదానోద్యమానికిపూర్వం (1965 మేనెల వరకు) | తుఫాన్ గ్రామదానోద్యమం తరువాత బల్లియా కాన్ఫరెన్సువరకు (ఏప్రిల్-1966) | మొత్తం గ్రామదానాలు (1966 సెప్టెంబర్ 30 తేదీ వరకు) |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 1. బీహార్ | 350 | 5,462 | 10,783 |
| 2. ఒరిస్సా | 2,469 | 2 251 | 5,205 |
| 3. మద్రాస్ | 325 | 638 | 1,867 |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 4. మధ్యప్రదేశ్ | 184 | 878 | 1,628 |
| 5. మహారాష్ట్ర | 915 | 755 | 2,057 |
| 6 రాజస్థాన్ | 378 | 456 | 970 |
| 7 గుజరాత్ | 200 | 114 | 416* |
| 8 ఆంధ్ర ప్రదేశ్ | 595 | 490 | 2,152 |
| 9 పశ్చిమ బెంగాల్ | 354 | 228 | 542 |
| 10. అస్సాం | 957 | — | 1,286 |
| 11. పంజాబ్ | 6 | — | 491 |
| 12 ఢిల్లీ | — | — | — |
| 13. ఉత్తర ప్రదేశ్ | 123 | 184 | 363 |
| 14 హిమాచల్ ప్రదేశ్ | 4 | 13 | 17 |
| 15 కేరళ | 403 | 6 | 409 |
| 16. మైసూరు | 58 | — | 58 |
| | 7,321 | 11,609 | 28,244 |

అనుబంధం 3

# బ్లాక్ దానాలు

(25 అక్టోబరు 1966 వరకు)

| రాష్ట్రం | జిల్లా | బ్లాకుల పేరు | మొత్తం బ్లాకులు |
|---|---|---|---|
| 1. బీహార్ | | | 22 |
| | హజారీబాగ్ | ప్రతాప్‌పూర్ | |
| | పూర్ణియా | పూర్ణియా-సదర్ తూర్పు | |
| | దర్భాంగా | 1 సరాయ్ రంజన్ | |
| | | 2. వారిస్ నగర్ | |
| | | 3. ఉజియార్ పూర్ | |
| | | 4. సమస్టపూర్ | |
| | | 5 తాజ్‌పూర్ | |
| | | 6. ఝుంఝుర్ పూర్ | |
| | | 7. కళ్యాణ్‌పూర్ | |
| | భాగల్పూర్ | 1 బీహ్‌పూర్ | |
| | | 2 గోపాల్‌పూర్ | |
| | | 3 నౌగచ్ఛియా | |

| రాష్ట్రం | జిల్లా | బ్లాకుల పేరు | మొత్తం బ్లాకులు |
|---|---|---|---|
| | మాంఘీర్ | 1 గోగ్రి | |
| | | 2 సాహబ్ పూర్-కమల్ | |
| | | 3. బల్లియా | |
| | పలమావ్ | 1. గరు | |
| | | 2 మానికా | |
| | ముజఫర్ పూర్ | మురోయిల్ | |
| | సారన్ | మాంఝు (Manjhi) | |
| | సహర్ష | నిర్మలి | |
| | దక్షిణపర్గణా | సుందర్ పహారి | |
| | షహాబాద్ | అఘూరా | |
| 2. మద్రాస్ | | | 13 |
| | తిరునల్వేలి | 1. రాధాపురం | |
| | | 2 నంగనేరి | |
| | | 3. వళ్ళియూర్ | |
| | | 4. కలక్కాడ్ | |
| | | 5. కరుంగులమ్ | |
| | | 6. పాలయన్ కోట్టై | |
| | | 7. విళైక్కులమ్ | |

| రాష్ట్రం | జిల్లా | బ్లాకుల పేర్లు | మొత్తం బ్లాకులు |
|---|---|---|---|
| | | 8. కయధార్ | |
| | మధురై | 1 నాథమ్ | |
| | | 2 మేలూర్-నార్త్ | |
| | | 3 ,, -సౌత్ | |
| | | 4 అతేనార్ పట్టి | |
| | | 5 వడమదురై | |
| 3. ఒరిస్సా | | | 13 |
| | కోరాపుట్ | 1. నారాయణ పట్న | |
| | | 2. బంధుగాంవ్ | |
| | | 3. దశ్మంత పూర్ (Dashmantapur) | |
| | | 4. లక్ష్మీపూర్ | |
| | | 5 ఉమర్ కోటి | |
| | | 6 దబుగాంవ్ | |
| | | 7 ఝూరింగా Jharinga | |
| | | 8. రాయఘడ | |
| | మయూర్ భంజ్ | 1. రసగోవింద పూర్ | |

| రాష్ట్రం | జిల్లా | బ్లాకుల పేర్లు | మొత్తం బ్లాకులు |
|---|---|---|---|
| | | 2 మరోదా (Maroda) | |
| | | 3 బంగ్రిపోసి-1 | |
| | | 4 ,, -2 | |
| | ఢెంకనాల్ | కంకడహాడ్ ( kankadahad ) | |
| 4 మహా రాష్ట్ర | ఠాణా | 1 కాసా | 7 |
| | | 2. సాయవాన్ | |
| | | 3. తాల్‌సారి | |
| | | 4. మఖోడా | |
| | | 5. జవాహార్ | |
| | | వికాస్‌ఘుర్ | |
| | చాందా | 1. మనోర్ | |
| | | 2 సిరవ్వంచ | |
| 5 మధ్య ప్రదేశ్ | | | 4 |
| | పశ్చిమనిమార్ | 1. నినాలి | |
| | | 2 సేంధ్వా | |
| | సియోని | కురోయ్ | |
| | టికంఘుర్ | టికంఘుర్ | |

| రాష్ట్రం | జిల్లా | బ్లాకుల పేరు | మొత్తం బ్లాకులు |
|---|---|---|---|
| 6 పంజాబ్ | | | 3 |
| | రోహటక్ | 1. ముడ్లానా | |
| | | 2 కథురా | |
| | కాంగ్రా | ప్రాగ్‌పూర్ | |
| 7 ఆంధ్ర ప్రదేశ్ | | | 2 |
| | మహబూబ్ నగర్ | 1. అచ్చంపేట | |
| | | 2. కల్వకుర్తి | |
| 8. గుజరాత్ | | | 1 |
| | బరోడా | బోరియాద్ | |
| | | మొత్తం | 65 |

అనుబంధం 4

# రాష్ట్ర శాంతిసేనా సమితుల సంయోజకులు

| రాష్ట్రం | సంయోజకుని పేరు | స్థానము |
|---|---|---|
| 1. అస్సాం | శ్రీ తరుణ బారువా | గౌహతి |
| 2 పశ్చిమ బెంగాల్ | శ్రీ కృష్ణకాంత చక్రవర్తి | కలకత్తా-12 |
| 3 బొంబాయి | శ్రీ లలూపా-గావ్ దేవి, | బొంబాయి-7 |
| 4 గుజరాత్ | శ్రీ జగదీశ్ లఖియా | బరోడా |
| 5. కేరళ | శ్రీ కే. దామోదరన్ | తిరుచూర్ |
| 6 మహారాష్ట్ర | శ్రీ మోతీలాల్ మంత్రి | బీడ్ |
| 7 మధ్య ప్రదేశ్ | శ్రీ చతుర్భుజ పారక్ | ఛత్తర్‌పూర్ |
| 8 పంజాబ్ | శ్రీ దాదాగణేశీలాల్ | రేవారి-గుర్‌గాంవ్ |
| 9 ఉత్తర ప్రదేశ్ | శ్రీ వినయ అవస్థి | కాన్పూర్ |
| 10. రాజస్థాన్ | శ్రీ బద్రీప్రసాద్‌స్వామి | జైపూర్ |
| 11 ఉత్కళ్ | శ్రీ రతన్‌దాస్ | రూర్కేలా (ఒరిస్సా) |

# అనుబంధం 5

## శాంతి సేన (1966 ఆగస్టువరకు)

| రాష్ట్రం | శాంతిసైనికుల సంఖ్య | శాంతికేంద్రాల సంఖ్య |
|---|---|---|
| 1 బీహార్ | 4,473 | 346 |
| 2 ఉత్తరప్రదేశ్ | 2,641 | 105 |
| 3. మహారాష్ట్ర | 1,871 | 300 |
| 4 రాజస్థాన్ | 699 | 84 |
| 5 మధ్యప్రదేశ్ | 613 | 41 |
| 6 పంజాబ్ | 402 | 7 |
| 7 అస్సాం | 380 | 80 |
| 8. పశ్చిమబెంగాల్ | 252 | 14 |
| 9 ఉత్కళ్ | 215 | 36 |
| 10. ఢిల్లీ | 195 | — |
| 11 ఆంధ్రప్రదేశ్ | 172 | 1 |
| 12 గుజరాత్ | 100 | 8 |
| 13 కేరళ | 66 | 19 |
| 14 తమిళనాడ్ | 59 | 45 |
| 15 మైసూరు | 17* | 12 |
| 16. హిమాచల్ ప్రదేశ్ | 7* | 12 |
| 17. నాగాలాండ్ | — | 2 |
| 18 నీఫా | — | 6 |
| | 12,162 | 1,118 |

*ఇవి అసంపూర్ణమైన అంకెలు

# అనుబంధం 6

## పారిభాషిక శబ్దాల అర్థవివరణ

| | |
|---|---|
| 1. అంబర్ చరఖా | వలయపు వడుకుపద్ధతి (ring-spinning type) ని ఆరుకదుళ్ళ క్రొత్తరాట్నం |
| 2. భూదానం | భూమిలేని పేదలకొరకు భూస్వాములు తమ భూమిలో కొంతభాగం దానంగా యివ్వడం. |
| 3. గ్రామదానం | 1 గ్రామంలోని భూ యాజమాన్యాన్ని గ్రామసభ (Village assembly)కు దానంచేయడం<br>2. భూమిలో 1/20 భాగం భూమిలేని వారికి దానంచేయడం<br>3 ప్రతి సంవత్సరం ఫలసాయంలో 1/40 వంతు గ్రామనిధికి విరాళంగా ఇవ్వడం. |
| 4 బ్లాక్ దానం | ఒక బ్లాక్ లోని కనీసం 80% రెవెన్యూ గ్రామాలను గ్రామదానంగా యివ్వడం. |
| 5 చరఖా | రాట్నం—ప్రత్తిని చేతితో నూలుగా వడుకుటకు ఉపయోగపడే కొయ్య సాధనం. |
| 6 గ్రామసభ | గ్రామసౌభాగ్యానికి, రక్షణకు సంబంధించిన సర్వవిషయాలను చర్చించి అవసరమైనచర్యలు తీసుకొనేందుకుగాను గ్రామంలోని వయస్కులైన స్త్రీ పురుషు |

| | |
|---|---|
| | లందరితో, లేక కనీసం గ్రామంలోని ప్రతి కుటుంబంనుండి ఒక్కొక్క వయస్కుని చొప్పున గ్రామ ప్రతినిధులతో ఏర్పాటైన గ్రామ పరిపాలనాసంఘం. |
| 7. గ్రామదాన సంఘం | ఒక జిల్లాలో గ్రామదానంగా వచ్చిన గ్రామాల ప్రతినిధులతో కూడిన జిల్లా సంఘం |
| 8. గ్రామ స్వరాజ్యం | గ్రామ ప్రజలందరికీ కావలసినతిండి, బట్ట, ఇల్లు, న్యాయం, శాంతికి సంబంధించిన స్వయంపోషణ, స్వయంసమృద్ధి |
| 9 కిశోర్ శాంతి దళం | యువజనుల శాంతిదళం |
| 10 తుఫానోద్యమం | తుఫాన్‌లా చాలా వేగంగా ఎక్కువగా గ్రామదానాలు సంపాదించే ప్రయత్నం |
| 11. మూర్తి త్రయం, కార్యక్రమ త్రయం, త్రివిధ కార్యక్రమం | గ్రామదానం, ఖద్దరు, శాంతిసేన |
| 12. మాల్‌గుజారులు | గ్రామం తాలూకు భూమిశిస్తు, తదితర రాబడులలో భాగంపొందే భూస్వాములు. |

| | |
|---|---|
| 13. శాంతి సేన | మామూలు సమయాలలో నిర్మాణ కార్యక్రమంలో పాల్గొంటూ అశాంతి సమయంలో దేశంలో శాంతి నెలకొల్పేందుకు జీవితాలను అంకితంచేసుకొన్న శాంతిసైనికుల సమూహం. |
| 14 శాంతి సేనా మండలి | పై స్వచ్ఛంద సేవకుల అఖిలభారత సంస్థ |
| 15. శాంతి సేవా దళం | శాంతి సేనకు అనుబంధంగా శాంతి స్థాపనకు ప్రయత్నించే స్వచ్ఛంద సేవక సమూహం. |
| 16. శాంతి సేవకుడు | తన స్థానంలో మాత్రం శాంతి నెలకొల్పడానికి పాటుపడే స్వచ్ఛంద సేవకుడు |
| 17 శాంతిసైనికుడు | సత్యాహింసలకు, శాంతిస్థాపనకు జీవితాన్ని అంకితం చేసుకొని అవసరమైనప్పుడు దేశంలో శాంతి స్థాపనకు ఏ మూలకైనా వెళ్ళడానికి సంసిద్ధులుగా ఉండి శాంతిస్థాపన ప్రయత్నంలో తన ప్రాణాలనుసైతం త్యజించడానికి కంకణం కట్టుకొన్న స్వచ్ఛంద ప్రజాసేవకుడు. |
| 18. శ్రాద్ధం | చనిపోయిన బంధువుల జ్ఞాపకార్థం శ్రద్ధతో చేయబడే మతకర్మ. |
| 19. సర్వోదయం | అందరియొక్క ఉన్నతి, వికాసం. |

| | | |
|---|---|---|
| 20 | సర్వోదయ మండలి | సర్వసేవాసంఘంయొక్క రాష్ట్ర, జిల్లాశాఖలు |
| 21. | సర్వోదయ పాత్ర | కుటుంబంలోని అందరికంటె చిన్న బిడ్డచేత తిండిలేని బీదసోదరుల సహాయార్థం గుప్పెడు ఆహారధాన్యాన్ని ప్రతిరోజూ ఒక ప్రత్యేకపాత్రలో వేయిస్తూ ఉండడం |
| 22 | సర్వసేవా సంఘం | కార్యక్రమత్రయం అనగా గ్రామదానం, ఖద్దరు, శాంతిసేనల కార్యక్రమాన్ని నడిపే అఖిలభారత స్వయంసేవక సంస్థ |
| 23. | సులభ గ్రామదానం | అందరికి సులువుగా అందుబాటులో ఉండేలా మార్పుచేయబడిన గ్రామదానం. |